# శ్రీకాళహస్తీశ్వరమాహాత్మ్యము

## పద్యనాటకము

### 1.వ రంగము

(కైలాసనాథ శాస్త్రి గుడి పరమేశ్వరునికి హారతిస్తాడు. కాశీనాథ శాస్త్రి కాళహస్తి మహాత్మ్యాన్ని వివరిస్తుంటాడు. అక్కడ రెడ్డిగారు, మనోరంజితం, కొందరు జనం ఉంటారు.)

కాశీ : మహాజనులారా..! కాళహస్తీశుని సేవించ ఎచ్చటెచ్చటినుండియో అరుదెంచిన భక్త జనులారా..! శ్రీకాళహస్తి క్షేత్ర పూర్వకథను మీకు సవివరముగా వివరింతును, శ్రద్ధాసక్తులతో ఆలకించండి.!

కం : తొలియుగమున శ్రీ నామము
గల చెలదియు, త్రేతయందు గాళం బను పా
ములపేదును, దానికి నీ
తలి యుగమున హస్తియున్, వ్రతంబున గొల్వన్..! **1**

శా : గౌరీశుండు, చెలంది బాము గజముం గైవల్య సామ్రాజ్య ల
క్ష్మీ రూపంబగు తన్ను గూర్చుకొనగా, శ్రీ కాళహస్తీశ్వరుం
డై రాజిల్లె దదీయభక్తిగరిమం బాద్యంతమున్ నీకు వి
స్తార ప్రౌఢి వచింతు, నయ్యా.! వినుమా దత్తావధానుండవై..! **2**

ఈయన వీరారెడ్డి ఈ కాళహస్తి అధికారి. దేవాలయ ధర్మకర్త.! (కైలాసనాథశాస్త్రి హారతి తీసుకుని బయటకు వస్తాడు) ఈయనగారిపేరు కైలాసనాథ శాస్త్రి.! ఈ ఆలయ ప్రధానార్చకులు.! నేను ఈయనగారి కుమారుడను కాశీనాథశాస్త్రిని.!

కైలా : కాశీ..! కాశీ..! రోజూ చెప్పే పురాణమేగా..! ఇదిగో ఈ హారతి భక్తులందరికీ పంచు.!

కాశీ : నమః పార్వతీ పతయే..! హరహర మహాదేవ... శంభోశంకర..!

(కైలాసనాథ శాస్త్రి నృత్యదుస్తులలో వున్న మనోరంజితాన్ని చూసి క్షణకాలం ఆగిపోతాడు. వెంటనే తేరుకొని పట్టించుకోనివానిలా గుడిలోకి వెళ్ళబోతుండగా.. తిన్నడు రెండు కుందేళ్ళని పట్టుకొస్తాడు.)

రెడ్డి : శాస్త్రులుగారూ..! ఈమెపేరు మనోరంజితం. దేవదాసి.! తను గజ్జకట్టి తొలి ప్రదర్శన కాలత్తీశ్వరుని సన్నిధిలో ఇవ్వాలని కోరుకుంది.! ఇక నుండి ఆమె ఇక్కడే వుండి ఆ కాలత్తీశ్వరుని సేవ చేసుకుంటానంటే నేను సరే అన్నా.!

కైలాస : శివుని ఆజ్ఞలేనిదే చీమైనా కుట్టదంటారు.! మనమెవరమండీ అనుమతించటానికి.. ఈమె ఇక్కడికి రావటం ఆ పరమేశ్వరుని సంకల్పం. ఓం శ్రీకాళహస్తీశ్వరాయనమః.

మనో : పాట : **1**
సకల వేదసారం శివోహం
సకల మూల మంత్రం శివోహం
సకల భూత దేవం శివోహం
సకల నాద తంత్రం శివోహం ॥సకల॥

ఆంగికాభినయ రూపకల్పనం
ఝటాఝూటధర పరమశంకరం
దుర్జన భయకర సజ్జన శుభకర
వాయులింగ శ్రీకాళహస్తి వర ॥సకల॥

(కాశీనాథశాస్త్రి దేవాలయంలో పూజ చేస్తూ మంత్రాలు చదువుతుండగా మనోరంజితం అందుకు తగిన విధంగా నాట్యంచేస్తుంటుంది.)

కాశీ : పంచాశద్వర్ణమూర్తిం, పరశివరమణిం, పంచభూతాత్మపీఠం
పంచక్లేశప్రణాశ ప్రఘటనచతురం, పంచవిద్యా స్వరూపం,
పంచాశత్కోటి పృథ్వీభరభరణ మహాభాగ్యలక్ష్మీ ప్రదాత్రిన్,
సంచారాగారయోగీశ్వరజనహృదయన్, జ్ఞానప్రసూనాంబికా వరం
శ్రీకాళహస్తీశ్వర మహాలింగేశ్వరం ॥సకల॥

(మనోరంజితం ఆహ్లాద భరితంగా నృత్యిస్తుంది. కైలాసనాథ శాస్త్రి ఆమెను తదేకంగా చూస్తాడు. కాశీనాథ శాస్త్రి శివనిర్మాల్యాన్ని తీసుకొని బయటకు వస్తుండగా కైలాసనాథ శాస్త్రి దానిని అందుకొని మనోరంజితం మెడలో వేస్తాడు. దాంతో అక్కడున్న వారంతా కూడా అవాక్కవుతారు.)

రెడ్డి : ఏంది శాత్రులుగారూ ఈపని.! ఆ పిల్లమెల్లో దండేశావ్.?

కైలాస : తప్పుచేశానని అంటున్నారా రెడ్డిగారూ..!

రెడ్డి : ఆడపిల్లమెల్లో దండేసి తప్పుకాదని బుకాయిత్తున్నా..!

కైలాస : ఇంత అవమానమా..! హరహర మహాదేవ శంభోశంకరా..! ఇంకా చూస్తూ ఆగిపోయావేం.! రా..! నీ త్రినేత్రాన్ని తెరచి దారుణ జ్వాలలతో నన్నుకాల్చి భస్మం చేయి శంకరా..! వేగిరా..! ఈ మూర్ఖులు నేను చేసిన చేష్టను తప్పు పడుతున్నారు.! ఎక్కడ నీ ప్రమథ గణాలు..!

రెడ్డి : అంతకోపమేందయ్యా శాత్రులు.! అడిగామంతేగదా.!

కైలాస : ఏమిటి మహాదేవా..! వీరికి వివరించాలా..! సరి సరి.. నీ ఆజ్ఞను నేనేనాడు కాదన్నాను చెప్పు.! అలానే తండ్రి..! వీరారెడ్డి అమాయకుడా..!

రెడ్డి : అవును తండ్రీ.!

కైలాస : సరే..! ఇక్కడున్న వీరంతా అమాయకులేనా.! సరే..! తండ్రి నీవు చెప్పినట్లు ఇప్పుడే వీరికి జ్ఞాన బోధ చేస్తాను.! నీ ఆజ్ఞను నేనేనాడు తప్పాను మహాదేవా.! నాయనలారా.! మహాదేవుని ఆజ్ఞానుసారం ధర్మసూక్ష్మాన్ని వివరిస్తాను.. వినండి.!

రెడ్డి : అరేయ్.! అందరూ కూసోండి.! పంతులోరు మనకి గ్యానాన్ని అందిత్తారు.! కూసోండి కూసోండి.!

కైలాస : సృష్టి ఆరంభంలో ఆవిర్భవించిన తొలినాదం ఓంకారం. ఆ ఓంకార ధ్వనిని ధ్వనింప చేసిన ఢమరుకాన్ని ధరించిన వాడు నటరాజు. అతని వేదిక ఈ జగత్తు. ఈ జగత్తుని జాగృతం చేసేందుకు తన అంశగా ఇటువంటి కళాకారిణులను సృష్టిస్తాడు. రుద్రుడే రుద్రుని అభిషేకించుకున్న విధంగా నటరాజు ఎదుట అతని ప్రతిరూపమైన ఈ కళాకారులు చేసే అర్చనే నృత్యార్చన. అటువంటి భగవత్ స్వరూపులను ఇలా సత్కరించటంలో తప్పులేదు కదా.!

రెడ్డి : కానీ మెల్లో దండేశారు కదా..! అదేందంటా.!

కైలాస : రెడ్డిగారూ..! భగవంతుని మనం పూలదండేసి సత్కరించటంలేదా.! నేను దండవేసి సత్కరించినది ఈమెలోని నటరాజుని. ఒక్కసారి చూడండి ఈమెలో ఒక నటరాజు కనబడటంలేదా.! బాహ్యనేత్రాలతో చూసేవారికి తప్పుగా కనిపించినా, మనో నేత్రంతో చూస్తే ఈమె ఒక శివాంశ సంభూతురాలిగా కనబడుతుంది.

కాశీ : కానీ నాన్నా...!

కైలాస : హర.. హర.. మహాదేవ..! శంభోశంకరా..! అన్నింటా అంతటా నిండి నిభిఢీకృతమైన పరమశివుని దర్శించ ఈ కైలాసనాథ శాస్త్రినే అనుమానిస్తున్నారా..! ఓ పరమశివా ..! రా.! వేగినే నీ త్రిశూలముతో నన్ను సంహరించు..! (కైలాసనాథ శాస్త్రి పూనకం వచ్చినట్లు ఊగిపోతుంటాడు)

రెడ్డి : నువ్వూరుకోవయ్యా చిన్న శాత్రులు..! శాంతించండి శాత్రులుగారూ..! శాంతించండి.! నాయనగారినంటే కల్లుపోతాయ్..! లెంపలేసుకో..! సమించండి శాత్రులుగారో..! ఆయన అపర పరమేశర అవతారం.!

(మనోరంజితం, రెడ్డిగారూ, కాశీనాథశాస్త్రి అందరూ వచ్చి కైలాసనాథ శాస్త్రి కాళ్ళమీద పడతారు. కైలాసనాథ శాస్త్రి శాంతిస్తాడు.)

తిన్న : ( తిన్నడు ముందుకొస్తాడు) మీలాంటివాళ్ళు ఇలాంటి వాళ్ళను గుడ్డిగా నమ్మబట్టే ఇంకా వీళ్ళ ఆటలు సాగుతున్నాయి.!

రెడ్డి : ఎవడవురా నువ్వు.

తిన్న : నాపేరు తిన్నడు. మాది ఉడుమూరు.

రెడ్డి : ఇక్కడికెందుకొచ్చావ్‌రా..!

తిన్న : రా..గీ అన్నావంటే మర్యాద దక్కదు. మా అయ్య ఎవరనుకున్నావో.. కోయరాజు నాథనాథుడు.

రెడ్డి : ఇంతకి నువ్వనేదేంటి?

తిన్న : కాత్రేని అర్చన సేయటానికి ఇట్టాంటోడు పనికిరాడంటున్నా.!

కైలాస : మరి నీలాంటోడు పనికొస్తాడా..! రా..రా..! అప్రాచ్చుడా..! వచ్చి నువ్వు పూజలు చెయ్యి.! మేమంతా తరిస్తాం.! రెడ్డిగారూ..! వాడుకానీ పూజ చేశాడో ఈ శ్రీకాళహస్తి పేరు చరిత్రలో సువర్ణముఖి సాక్షిగా చిరస్థాయిగా నిలిచిపోతుంది.! వర్ణసాంప్రదాయాలకు తెరపడుతుంది. అయినా ఇలాంటి వాళ్ళను దేవాలయాల్లోకి ఎలా రానించారు.!

తిన్న : ఏమైతుందయ్యా వత్తే.! ఆ కాత్రేడు నిన్నెలా సృట్టించాడో... నన్నలాగే సృట్టించాడు. నీకూ నాకూ తేడాలేదు.!

కైలాస : హే కాళహస్తీశ్వరా..! నీ ముందరే నీ భక్తునికి ఇంతటి అవమానం జరుగుతుంటే చూస్తూ నిర్లిప్తత వహింతువా..! వలదు స్వామీ వలదు.! ప్రమధ గణ పరివేష్ఠితునవై .. భూతగణ ములను వెంటపెట్టుకొని అధర్మంతో అలరారబోనున్న ఈ భూమాతను ఉద్ధరించేందుకు ఇలాంటి నరాధములను అంతమొందించేందుకు రా..! ఇంత జరుగుతున్నా..! మౌనంగా ఉన్న వారిని శిరచ్ఛేదం చేసేందుకు రా..!

రెడ్డి : మమ్మల్ని సమించండి శాత్రులుగారూ..! రేయ్ పోరా బైటికి.!

తిన్న : వాడి కపట నటనను చూసి మీరు మోసపోతున్నారు.!

రెడ్డి : ముందు కదుల్తావా లేదా.! ఇంకెప్పుడూ ఈ గుల్లోకి అడుగు పెట్టకు.! (బయటకు తోస్తారు)

తిన్న : (తన చేతిలో బాణంతో రెడ్డిగారిని ఒక్క తోపు తోస్తాడు) రేయ్..! నేను యాపారం సేసుకోటానికొచ్చా.! మా ఊరెలతా కాత్రేని దర్శనం సేసుకుందా మనుకున్నా.! కానీ కాత్రేడు నీలాంటోళ్ళ సేతుల్లో ఇరక్కపోయాడు. ఇక నాకేం సేత్తాడు మేలు. అందుకే ఎల్లిపోతున్నా.! (తిన్నడు వేగంగా వెళ్ళిపోతాడు)

కైలాస : రెడ్డిగారూ..! దేవాలయం అన్నాక మడి ఆచారాలంటూ కొన్ని వుంటాయండీ.! ఇలాంటి వెధవలు ప్రవేశించి వాటిని మంటగలుపుతుంటే అడ్డుకోవాల్సిన బాధ్యత మీలాంటి వాళ్ళకుంది. ఆవెధవ అన్ని కూతలు కూస్తుంటే...

రెడ్డి : చమించండి శాత్రులు గారూ..! ఇక ముందిలా జరగదు. రేయ్ మాదిగ పల్లెలో సాంబిగాడు ఉన్నాడు. ఆడ్ని పిలిసి ఈ గుడున్న నాలుగు ఈదుల్లోకి తక్కువ కులపోల్లు రాకూడదని సాటింపేయించండి.! (డప్పుశబ్దం వినిపిస్తుండగా.. లైట్స్ ఫేడ్ అవుతాయి)

లైట్స్ ఆఫ్

## 2.వ రంగము

(అదొక పర్ణశాల. నీల పూలు కడుతూ కూర్చునుంటుంది. తిన్నడి కోసం ఎదురు చూస్తుంటుంది.)

నీల : కాలత్రి ఎల్లిన మావ ఇంకా ఇంటికి రాలేదు. గూడెపోల్లంతా గుర్రెట్టి నిద్రోతున్నారు.

పాట : **2** రావోయి ... రావోయి.. మావా..!
నీరాక లేక .. నిదురే రాక..!
గూటిలోని గువ్వ గోల చేస్తుండాది.!
ముంగిట నెమిలెమ్మ మూగబోనాది ॥ రావోయి ॥
ఏదారి నున్నాడో.. ఎందాక వచ్చాడో..
జాడైన తెలుపవా.. ఓ చందమామ
ఇంటికాడా నీల.. ఎదురు సూత్తాండదని
ఏగినే ఎదురేగి .. ఇవరించరాదా...! ॥ రావోయి ॥

(ఇంతలో తిన్నడు చేతిలో కుందేళ్ళు పట్టుకొని ఇంటికొస్తాడు. నీల ఎదురెల్తుంది. తిన్నడు కుందేళ్ళని ఆమెకిస్తాడు. గుడిసెలోకెళ్ళి వాటిని వుంచి బయటకు వస్తుంది. తిన్నడు అప్పటికే తిన్నెమీద కూర్చొని వుంటాడు. ఆలోచిస్తుంటాడు. నీల అతని ముందు హొయలు ఒలకబోస్తుంది. కానీ తిన్నడు అవేమీ పట్టించుకోడు. అతని పరిస్థితిని అర్థం చేసుకొని నీల వచ్చి తిన్నడి పక్కన కూర్చుంటుంది.)

నీల : ఏమైంది మావా.! అట్టున్నా..!

తిన్న : ఏం లేదే..! బానే వున్నాగా..!

నీల : నీ మనసు బాలేదని నీ మొహం చెబుతోంది.!

తిన్న : ఐదురోజుల నుండి తిరిగి తిరిగి వచ్చాకదా.! అందుకే..

నీల : అలిసిపోతే నీ ముహం అలా ఎందుకుంటది..!

తిన్న : నీ యవ్వ..! ఏందే నీగోల..!

నీల : ఏంది మావా..! పానానికి పానంగా పేమించినోడివి.! నన్నే ఇసుక్కుంటుండావంటే ఏందో అయింది. నీమనసు కట్టపెట్టినోడెవరు మావా.!

తిన్న : ఏం చెప్పమంటావే..! మనిషిని మనిషిగా చూడటం చేతకాని సమాజమే ఇది..! పేరుకేనే నాగరికం. అక్కడంతా అనాగరికమే.!

నీల : ఏంది మావా ఏందేందో మాట్టాడతన్నా.!

తిన్న : చెప్తాను నీల.! మనం సతుకున్నోలమైనా, యాపార పరంగా ఎంత గొప్పగా వున్నా మన కులవృత్తి అయిన వేటని, సంప్రదాయ దుస్తులను, వేషభాషల్ని వదులుకున్నామా.! లేదే..! కానీ నాగరిక లోకంలో ఎక్కడికక్కడ కట్టుబాట్లు. వాళ్ల ఇల్లల్లో గదులున్నంత విశాలంగా వాళ్ళగుండె గదులుండవే.! (నీల నవ్వుతుంది) ఏందే పిచ్చి ముఖమా..! ఆ నవ్వు.!

నీల : మన గూడెపోల్లలో నీలా పుత్తకాల బాస మాట్టాడేఆల్లు లేరు. నువ్వలా మాట్టాడతాంటే అచ్చం పంతులోల్లు మాట్టాడినట్టుంది.!

తిన్న : నీలా..! నాలుగూల్లు తిరిగి కస్తూరి, జవ్వాది, అగరు, వజ్రాలు, ముత్యాలు అమ్మేవాడిని. నలుగురుతో మాట్లాడేప్పుడు నాలుగు ముక్కలలా నేర్చుకుంటాం. ఉడుమూరు వైభవాన్ని పెంచాల్సిన బాధ్యత ఏలికగా నాకుంది కనుక నేను ఎన్నో భాషల్లో మాట్లాడాలి.

నీల : అది సరే.! ఇంతకి కాట్రేని దర్శనం అయిందా.!

తిన్న : ఇప్పటిదాకా చెప్పేది ఆ విషయమేనే.! కాట్రేని దర్శనానికెల్లానా.! అక్కడ ఓ అమ్మాయి నృత్య చేస్తోంది. ఇంతలో ఆ గుడి పూజారి ఆ అమ్మాయి మెల్లో దండేశాడు.

నీల : మనువాడాడేమో.!

తిన్న : కాదంట..! కాట్రేని ఆ పిల్లలో సూశానంటా.. అక్కడోల్లని నమ్మించాడు.! వెర్రిజనం ఆ పూజారిని కాట్రేడంటానే పూజలు సేత్తన్నారు.

నీల : అదేంటి మావా.! మడిసిని మడుసులే పూజిత్తున్నారా..!

తిన్న : అలా పూజించటమే నాగరికతంట! రానున్న కాలంలో ఇట్టాంటి దేవుల్లు చెట్టుకొకడు పుట్టకొకడు పుట్టుకొత్తాడేమోనే..!

నీల : ఇంతకి కాట్రేని దర్శనం అయిందా లేదా.!

తిన్న : సేసుకున్నానులే..! కానీ నాకు ఒక్కటే దిగులుగా వుందే.!

నీల : ఏంది మావా.!

తిన్న : కాట్రేడు ఇట్టాంటోల్లుండే సోటే ఎందుకు బంధీగా వున్నాడో..! ఆల్లకే ఎందుకు కొమ్ము కాత్తున్నాడో..!

నీల : మావా..! ఆల్లుపెట్టే పెసాదాలు తింటం వల్లనే కాట్రేడు ఆల్లైవున్నాడేమో..!

తిన్న : నిజమేనే.! అట్టయితే ..! కాట్రేడు మన ఉడుమూరికి వచ్చేతే..! ఆలోచన బాగుందిగా...! ఓ సామీ.. నువ్వు మా పల్లెకి వస్తే...!

గీ ॥ పుట్టతేనియ పెరతేని పుట్టజున్ను
తొట్టితేనియ గల, వందు దోచి తోచి
కాలి దులదులనై పిండి పోలె రాలు
నట్టి నింజెట్లు గలవు నీ కారగింప 3

గీ॥ చుఱుకు జూపున గానిన కొఱత నుఱుపు
నుఱుకు జూపుల బుట్టించు నెఱుకవారి
ఇరుకు వలిగుబ్బ పాలిండ్ల యిగురు బోండ్ల
సేవ కిచ్చెద నీకు విచ్చేయు మయ్య 4

నీల : నీ పిచ్చికానీ మావా..! కాట్రేడు మనలాంటోల్ల మాటలింటాడా.! ఇన్నా మన పల్లెకి వత్తాడా.!

తిన్న : వస్తాడు.! నేను వెళ్ళి తీసుకొస్తా..! నాతో వచ్చాడో సరే.! లేకుంటే నేనూ అక్కడే ఉండిపోతా.!

నీల : మరి నేనో..!

తిన్న : నేను రాకుంటే నువ్వే కాలత్రి వచ్చేయ్..!

నీల : మావా..! నువ్వులేని ఈ సోటు నాకూ వద్దు.! నేనూ నీతో ఇప్పుడే బయల్దేరొత్తా.!

తిన్న : సేసేదేముందే..! ఉడుమూరు బాధ్యత సింగన్నకి అప్పజెప్పి వత్తా.! నేనొచ్చేదాకా సింగన్న ఏలికగా కొనసాగుతాడు.! అంతగా అవసరమైతే కాలహస్తికి వచ్చేమని చెప్పివస్తా..! ఈలోగా అన్నీ సరుదు. (తిన్నడు బయటకు వెళ్ళును, నీల లోనికి పోతుండగా లైట్స్ ఫేడ్ అవుతాయి)

లైట్స్ ఆఫ్

## 3.వ రంగము

(మనోరంజితం తన ఇంటిలోనున్న శివలింగానికి నమస్కరిస్తుంది.)

మనో : క : భక్తవత్సల ! కాలసంభవము లగుచు
గాలభుక్తంబు లయ్యెడి కమలజాది
పదవు లేనొల్ల, గాలంబుబట్టి మ్రింగ
నోపు నీ చిన్మయాకృతి జూపు మీశ ! **5**

హే కాళహస్తీశ్వరా..! నిన్ను చూడని కన్నులు, నీ నామస్మరణ చేయని నోరు, వినని చెవులు వుండేమి ఉపయోగం..! దేవదాసి వృత్తి నా తరతరాలనుండి వస్తుంది. ఏ ఊరికి పోయినా నన్ను వేశ్యరికము చేయమనువారే కానీ దేవదాసిత్వానికి అనుగ్రహించ లేకపోతున్నారు. మహేశ్వరా..! మనసా వాచా కర్మణ నేను నిన్నే నాభర్తగా ఎంచుకున్నాను.! మలినమంటినది ఈ శరీరానికి కావచ్చుకానీ మనసుకు కాదు కదా.!

ఉ : ఆదిగృహస్థ శేఖరుడవైన నినున్, భవతాపనక్షుధా
వేదనచే దపఃకుతపవేళ గనుంగొన గల్గె, బ్రహ్మవి
ద్యాదన భిక్ష నాదు హృదయంబను పాత్రమునందు బెట్టవే
యాదర మొప్పగా, మరిక యాచితవృత్తి సుఖింతు నీశ్వరా.! **6**

(కైలాసనాథశాస్త్రి వచ్చి తలుపు కొడతాడు. మనోరంజితం వెళ్ళి తలుపు తీస్తుంది)

కైలాసనాథ శాస్త్రులు గారికి ప్రణామం.

కైలాస : మనోవాంఛ ఫల సిద్ధిరస్తు..

మనో : ఊరకరారు మహాత్ములు.

కైలాస : కార్యార్ధినయ్యే వచ్చాను.

మనో : దేవదాసి ఇంట మీబోంట్లకు కార్యమా.! ఏమై వుండునబ్బా..!

కైలాస : మనోరంజితం... దేవాలయంలో నీ నృత్యం చూశాను. మహాదేవుడే మహదానందపడేలా నర్తించావ్.!

మనో : మీ మెప్పు కాళహస్తీశ్వరుని మెప్పుతో సమానమని ఊరిలో అనుకుంటుంటే విన్నాను.

కైలాస : అన్నవారెవరో కానీ విన్నవారు సరిగానే విన్నారు.

మనో : శాస్త్రిగారూ..! మీబోటివారు మా ఇంట ఎక్కువ సేపుండటం చూసేవారికి, మీకూ, నాకూ అంత శ్రేయస్కరం కాదు. వచ్చిన కార్యమును వేగినే ముగించండి.

కైలాస : అంత తొందరగా వుందే మనోరంజితం.!

మనో : తొందరకాక మరేంటి శాస్త్రులుగారూ.! తాటిచెట్టుకింద ఒకింత విశ్రాంతి తీసుకుందామని రొంటిన కట్టిన ముంతలో మంచినీళ్ళు తాగుతున్నా కల్లు తాగుతున్నారంటుంది ఈ లోకం.

కైలాస : లోకం ఏమనుకున్నా నేను పట్టించుకోనులే మనో..!

మనో : మనో..! ఏంటి శాస్త్రులుగారూ.. విషయం జోరుగా వుందే..!

కైలాస : ఉండదు మరీ.! నీ నృత్యభంగిమలు చూశాక నటరాజుకే నాట్యం నేర్పేలా వున్నాయి ఆ ముద్రలు. నీ సౌందర్యానికి ప్రకృతి మాత కూడా ఈర్ష్యతో దహించుకుపోవాల్సిందే.! నీ మేని కాంతికి శతకోటి సూర్య తేజస్సైనా సాటిరాగలదా.! మనో..!

మనో : శాస్త్రులుగారూ..! కార్యార్థినై వచ్చానని కవిత్వం అల్లుతున్నారు.!

కైలాస : ఆమాత్రం గ్రహించనిదానివా మనో.!

మనో : శాస్త్రులుగారూ..! నేను గ్రహించలేక కాదు.! మీ బుద్ధి సదా పరమేశ్వరుని పాదములపై వుండాలికానీ నా వంటి దేవదాసి దేహముపై కాదని గుర్తుచేస్తున్నా..!

కైలాస : నీవు గ్రహించావన్న విషయం నాకూ తెలీక కాదు.. అడగకుండానే నా కోర్కెతీర్చే ముక్కంటి కూడా తీర్చలేని కోరిక నిన్ను కోర వచ్చాను.

ఆవె. పరమశివుని గొల్చు పరమభక్తుడ నేను
వరము లీయకున్న వదలిపోను
అధర సుధలు బొంద అరుదెంచి నాడను
వలదు పొమ్మనగను వలదు వలదు 7

మనో : అయ్యో శాస్త్రులుగారూ..! మతి తప్పి మాట్లాడుతున్నారులా వుంది.!

క : మగువకు శరీర మొసగిన
మగడు, చిదంగనకు మగడు, మాయా సతికిన్
మగడు, మగవేల్పులకు దగు
మగడు మగడు గాక, మాకు మనుజుడు మగడే? 8

నేను ఆ దేవదేవుని భర్తగా భావించిన దానను. వేశ్యను కాను.

ఆవె. దేవదాసి యనిన దేవదేవుని గొల్వ
నెంచబడిన యట్టి నెలతగాదొ
ఇట్టిమాటలాడ ఎట్టి ధర్మమొదెల్పు
భూసురేంద్ర నాతొ భోగమంద 9

కైలాస : మనో...! ఇటువంటి సమయంలో ధర్మాధర్మాల ప్రస్తావన తెస్తావెందుకు.!

ఆవె. ధర్మ బోధ కోర దండుగ కార్యమ్ము
తెలుప వలసినపుడె తెలుప గలను
ధర్మ మర్మమెల్ల దర్శించె వచ్చితిన్
రుద్రు నభిషికించు రుద్రుడీను 10

దేవదేవుడైన ఆరుద్రుని అనునిత్యం అర్చించే నేనూ రుద్రుడనే.! అర్థంకాకున్న వివరించి చెప్పుదును. రుద్రాభిషేకం నిర్వహించే సమయంలో నేను రుద్రుని నా శరీరంలోకి ఆవాహన చేసుకొనవలెను. అటుపిమ్మట రుద్రునకు అభిషేకాదులు నిర్వహింపవలసి వుండును. అనగా రుద్రుడు, రుద్రుని అభిషేకించు ప్రక్రియే రుద్రాభిషేకం. కనుక నేను దేవదేవుడనే.!

సీ : రతివధూ మదనులు, రంభా కుబేరపు
త్రకు, లూర్వశీ పురూరవులు, మేన
కా కౌశికులు, గోపికా ముకుందులు, ధాన్య
మాలినీ రావణుల్, మత్స్యలోచ
నర్ష్యశృంగులు, దాశనలినేక్షణా పరా
శరులు, తారా నిశాకరులు, గౌత

మాంగనా దేవేంద్రు, లమరవేశ్యా జయం
తులు, ద్రౌపదీ పాండవులు, పృథాబ్జ
గీ॥ హితులు, నడచిన గతు లాత్మసుతల బెంచు,
నింటిగోడల వ్రాయించు నిందువదన
వనితలకు సరసత కల్మి వావివరుస
లేమియును లేమి వారల కెఱుకఱుప 11

మనో : శాస్త్రులుగారికి సాని శాస్త్ర హితోపదేశమూ తెలుసునే..!

కైలా : మరి.! సకల శాస్త్ర పారంగతుడనైన నాకన్నా మించినవారెవరున్నారీ ముజ్జగాలలో...

మనో : ఇంకా.! శాస్త్రులుగారికి సానింటిపాఠాలు ఏం తెలుసో...!

కైలా : చెప్తాను విను...

గీ : వేకువలయందు విటునిచే వీడియంబు
బుచ్చుకొన దగ దింతికి, బుచ్చుకొన్న
నూర నూరంగ దద్రసం బుమియ వలయు,
వెలదులకు మందు వెట్టెడువేళ గాన. 12

చ : కలహముచూపు చూపు దొలుకారు మెఱుంగులు, తర్జనోక్తి గ
ర్జలు, కపటాశ్రవృష్టి, బలుచాయల మేఘమునా విలాసినీ
తిలకము పల్లవావళి మదిం జనియించిన మోహశాలి కం
దళముల బ్రోదిసేయక, వృథా వసియించిన నర్థ మబ్బునే? 13

మనో : చాలు చాలు శాస్త్రులు గారూ..! మీరు సకల శాస్త్రాలను వల్లె వేసిన వారని నాకు అర్థమైంది.!

కైలాస : మరి నా ముచ్చటో..!

మనో : నేను వ్రతమాచరిస్తున్నాను.! అది ముగియటానికి ఇంకో పది దినములు పడుతుంది.

కైలాస : సానులు సరసాలాడాలే కానీ వ్రతాలు చెయ్యకూడదు. మీ వారకాంతలెలా వుండాలంటే.!

సీ॥ మణి మంత్ర తంత్రముల్, మందులు, మాయలు,
సరస భాషలు, వృథా సంభ్రమములు
దెచ్చి కోలేద్పులు, నిచ్చకంబులు, వట్టి
యానలు, డక్కులు, నలస గతులు,
నలుకలు, దరితీపు, లాసలు బ్రియములు,
నగవులు, బిగువులు, నయము, భయము,
బలిమియు, జెలిమియు, బాసలు, ననుపులు
దిట్టులు, గొట్టులు, దిట్టదనము
గీ॥ జాయవాటులు, సన్నలు, గాయకములు,
మెచ్చులును, దచ్చనలు, బరపొచ్చెములును
దగవులును, వారకాంతా వితానములకు
జలజలోచనలార! నైసర్గికములు 14

అట్టి ఆనవాలేమీ ఈ ఇంట కనిపించుట లేదు. నీలో వారకాంతా లక్షణములు రవంతైనను గోచరించుటలేదు. ఎవరి వృత్తి ధర్మాలను వారు అనుసరించాలే కానీ ఒకరి వృత్తుల్లోకి ఒకరు రారాదు. కనుక నా ముచ్చట తీర్చుము.! లేకున్న నిన్నీ కాళహస్తి నుండి వెడల గొట్టించ గలను.! అవసరమైతే అంతమొందించనూ గలను.! భక్తి, ముక్తి పక్కనపెట్టి రక్తి పాఠాలు పట్టు

మనో : శ్రీకాళహస్తీశ్వరునికి పదునైదు దినములపాటు నృత్యార్చన చేయాలనే నియమముతో..!

కైలాస : శ్రీకాళహస్తీశ్వరుడా..! ఓ బండరాయికి దేవుని పేరు ఆపాదించినంతమాత్రాన అది దేవుడై పోతుందా.! నేనంటే భుక్తికోసం ఏవో పూజలు చేస్తున్నాననుకో..! మరి నీకెందుకు చెప్పు.!

మనో : మీది భుక్తి, నాది భక్తి..

కైలాస : మరి రక్తో.!

మనో : ముక్తి మార్గం చెప్పవలసిన మీరు రక్తి గురించి మాట్లాడుతున్నారు.!

కైలాస : సానింట చెప్పేపాఠాలు రక్తిపాటాలే కానీ, జీవితంపై విరక్తిని కలిగించే ముక్తిపాఠాలు కావు.

సీ ॥ రసికులు మీ గానరస మాన వచ్చిరి
పాడరే, శివభక్తి పాడుగాను,
జాణలు మీ విలాసము జూడ వచ్చిరి
చూడరే, శివభక్తి చూఱవోను
పల్లవుల్ మీతోడ భాషింప వచ్చిరి
పలుకరే, శివభక్తి పాఱిపోను,
పార్థివుల్ సకలసంపద లీయ వచ్చిరి
పిలువరే, శివభక్తి పెంపుచెడను
ధనము గలిగిన జంగమార్చన మొనర్ప,
శివున కఖిలోపచారముల్ సేయ వచ్చు
వనజముఖులార ! నా సరివారిలోన
సిరుల మెఱయుచు, దలయెత్తి తిరుగవచ్చు! 15

కనుక మనో..! శివభక్తిని పక్కన పెట్టి సరస సల్లాపాల సాగరంలో నన్ను ఓలలాడించు. నీ మధురాధర సుధారస సారాన్ని తనివితీరా అందించు. మన గాఢాలింగన సల్లాప హోమంలో ఆహా..! ఓహోల.! మంత్రాలతో..! ఉఛ్వాశ నిఛ్వాసల హవిస్సుని పోసి సలిపే శృంగార హోమ ఫలాన్ని తనివితీరా అనుభవించు. నన్ను అనుగ్రహించు.

మనో : అపర పరమేశ్వర స్వరూపులైన మీ అంతటివారు చెప్పిననూ నేను మొండి పట్టు పట్టుట పాడి కాదని అనిపించుచున్నది. మీకోరిక తప్పక నెరవేర్చెదను. మరి నా కోరికను మీరు మన్నించవలసి యున్నది.

కైలాస : తప్పక నెరవేర్చెదను. కోరుట కాదు.. ఆజ్ఞాపించు. నీ అందానికి నేను బంధీని.

మనో : పదిహైదు దినములు నన్ను నృత్యార్చన సలుపనివ్వండి. అటుపై మీ అభిమతమునకు నేనెట్టి పరిస్థితులలోనూ అడ్డుచెప్పను.

కైలాస : సరే..! ఏం చేస్తాం.! అలానే వెళ్ళి వస్తాం.!

లైట్స్ ఆఫ్

## 4.వ రంగము

( తిన్నడు, నీల ప్రాతః కాలమునందు కాళహస్తీశ్వరుని దర్శించుకుంటుంటారు. కాశీనాధ శాస్త్రి గర్భగుడిలో తన పని తాను చూసుకుంటూ తిన్నడితో మాట్లాడుతుంటాడు.)

కాశీ : సువర్ణముఖిలో స్నానమాడి మడిగట్టుకు వచ్చినా, స్నాన సంధ్యాదులు లేకుండానే ధూళి దుస్తులతో దర్శనానికి వచ్చినా, ఉపవాసవ్రతంతో నీరసించినవారెంతో, కడుపునిండా తిన్నాకే కైలాసపతి దర్శనమని నమ్మినవారికి కూడా అంతే ఫలితాన్ని అనుగ్రహించగలడు కాళహస్తీశ్వరుడు. మిత్రుడైనా, శత్రువైనా, మహారాజైనా, సేవకుడైనా శివుని దృష్టిలో సమానమే తిన్నయ్యా.! సుహృద్విపక్ష పక్షయో, తృణారవింద చక్షుషో, ప్రజా మహీ మహేంద్రయో.. అంటాడు రావణాసురుడు శివతాండవ స్తోత్రంలో. మనం ఒక అడుగు వేస్తే, తాను పది అడుగులేస్తాడు. కాళ్ళు పట్టుకుంటే నెత్తి నెక్కించుకుంటాడు. నెత్తినెక్కించు కోమంటే గుండెల్లో దాచుకుంటాడు. మన గుండెల్లో ఆ కాళహస్తీశునికి ఇంత చోటిస్తే ముజ్జగాలనే రాసిచ్చేస్తాడు. అంతటి భోళాశంకరుడమ్మా నా కాళహస్తీశ్వరుడు.

తిన్న : మరి..! ఆ స్వామికి లేని తేడాలు మనలో మనకెందుకయ్యా చిన్న శాత్రులుగారూ.!

కాశీ : కేవలం..! నిజాన్ని జీర్ణించుకోలేని ఏ కొద్ది మందో తమను తాము ఉన్నతులుగా, ఉత్తమ జాతీయులుగా నిలుపుకునేందుకు చేస్తున్న ప్రయత్నం. అయితే రానున్న కాలంలో ఎప్పటికైనా ఇందుకు తగిన మూల్యం చెల్లించుకోక తప్పదు తిన్నయ్యా.!

కైలాస : (ప్రవేశిస్తూనే తిన్ననిపై మండిపడతాడు) ఒరేయ్.! అప్రాచ్యపు పీనుగా..! మళ్ళీ దేవాలయం లోకి తగలడ్డావూ.! నీవల్ల ఈ దేవాలయమే మైలపడిపోయిందిరా..! ఒరేయ్ కాశీ..! ఈ కులం తక్కువ వెధవల్ని, ఈ అంటరాన్ని వాళ్ళని ఎలా రానిచ్చావురా లోపలికి.!

తిన్న : ఏమయ్యో.! పూజారిగారూ..! మాట.. మాట.. హద్దుమీరుతున్నావ్.! (నీల తిన్నడి చెయ్యి పట్టుకొని ఆపాలని చూస్తుంది) నువ్వాగు నీల.! ఉన్న కులాలు రెండే.! ఒకటి మంచి. ఇంకొకటి చెడు. మతం ఒక్కటే.. మానవత్వం. ఇదే ఆ కాళహస్తీశుని తత్వం.!

కైలాస : (రెడ్డిగారూ వెనకాలే వస్తారు. అతన్ని చూస్తూనే) విన్నారుటండీ రెడ్డిగారూ..! ఈ కుంక చెబుతు న్నాడండీ.. మతాల గురించి, కులాల గురించి. ఇక మడెందుకు, ఆచారాలెందుకు, మనమెం దుకు.! తగల బెట్టటానికి తప్ప.!

తిన్న : నిజమేనండీ..! గుడ్డిగా నమ్మే ఆచారాల్ని తగల బెట్టినా తప్పుకాదు. చిన్న శాత్రులుగారికున్న జ్ఞానం కూడా తమకి లేనందుకు సిగ్గుపడండి.

కైలాస : అదండీ సంగతి.! ఒరేయ్ కాశీ..! ఇదంతా నువ్విచ్చిన అలుసటరా..! దేవాలయాన్ని శుభ్రం చేసి, అభిషేకానికి సిద్ధం చేయరా అంటే అడ్డమైన కోయవెధవల్ని గుళ్ళోకి రానిస్తావా.!

(కైలాసనాధశాస్త్రి చెయ్యెత్తుతాడు. ఆ చెయ్యి తిన్నడు గట్టిగా పట్టుకొని నొక్కుతుంటాడు. కైలాస నాధ శాస్త్రి విలవిలలాడుతుంటాడు.)

తిన్న : పెద్దశాత్రులు..! మర్యాద..! మర్యాద..! చిన్న శాత్రుల్ని ఇంకొక్క మాటన్నావంటే ఒగ్గేది లేదు. నేను ఎవరినో తెలుసా ఉడుమూరి ఏలికను. నేనూ శాస్త్రాలను చదువుకున్న వాడనే. శ్రీకాళహస్తీశ్వరుని భక్తుడిని. పేరు తిన్నడు. అసలు మా ఊరెలా వుంటుందో తెలుసా..!

ఉ : పొత్తిపినాటిలో విపినభూమి గిరాతుల కాటపట్టు, లో
కోత్తరవన్యవస్తు 'వుడుమూ'రను పక్కణ మొప, దద్రమో
దాత్తమహత్త్వ మద్భుతరసావహ మూహ యొనర్ప, మేదినీ
భృత్తట నిర్ఝరాంబురుహబృంద మరంద సుగంధ వాహమై.! – 16

అట్టి మా పట్టణమున జీవన మెట్లుండునో వివరింతును వినుడు.

సీ : స్తబ్ధరోమవిషాణ లబ్ధమౌక్తికముల
బాటింపుదురు రేగుపండ్ల పాటి,
ముక్తకంచుకమస్త ముక్తాఫలంబుల
మందలింతురు గురువెంద లట్లు,
సమదసామజ కుంభజములైన ముత్తియం
బుల జూతు రుసిరికాయల విధమున,
వేణుజాతములైన యాణిపూసల నెంతు
రూడగుపండ్లకు నీడు గాగ,
గంధసారాగురుద్రమ కాష్ఠఖండ
చయము దమ యంటి వంటకట్టియలు గాగ,
జేయుదురు కాపురంబులు సేయునపుడు
చెంచెతలు చెంచులను గూడి చిత్రలీల. – 17

పెద్ద శాస్త్రులుగారూ ..! మీ కొచ్చే కస్తూరి, జవ్వాది, పునుగు, అగరు, పుట్టతేనె, గంధం, సీకాయ ఇవన్నీ మేం సేకరించి మీకు పంపుతున్నాం. వాటికి లేని మైల మేము మీ గుడికొస్తే వచ్చిందా.!

కైలాస : నాలుగు అక్షరం ముక్కలు నేర్చుకొన్నంత మాత్రాన సరిపోదురా..! బ్రహ్మోపదేశం పొంది జ్ఞానాన్ని గ్రహించిన మేమెక్కడ., అట్టి అర్హతను కలనైనా పొందని నీవెక్కడరా..! శుంఠ.!

తిన్న : శాస్త్రులుగారూ..! శివతత్వమంటేనే ప్రేమతత్వం. ఆ ప్రేమకు షరతుల్లేవు. పరిమితుల్లేవు. రాజూ, పేదా తేడాల్లేవు. పశుపక్ష్యాదులన్న బేధంలేదు. ఎక్కడిదాకో ఎందుకు కాళహస్తీశ్వరునే చూడండి.. సాలెపురుగుకు ముక్తినివ్వటమేమిటి? గజరాజుకు జన్మరాహిత్యాన్ని ప్రసాదించటమేమిటి? నాగుపాముపై అపారమైన ప్రేమను కురిపింపచేయటమేంటి? సర్వసృష్టి సమానత్వమే శివతత్వం. బలాలూ, బలహీనతలూ, అహంభావాలు, అహంకారాలతో సహా ఎవరెలా ఉంటే అలానే, యథాతథంగా ఆమోదించేస్తాడు, ప్రేమిస్తాడు పరమేశ్వరుడు. రావణుడు రాక్షసుడని ఆయనకు తెలియక కటాక్షించాడా..! భస్మాసురుడు కృతఘ్నుడని తెలియక వరమిచ్చాడా.! ఎవర్నీ కాదనడు, ఎవర్నీ వద్దనడు.

కైలాస : ఏమిటండీ రెడ్డిగారూ..! వాడలా పిచ్చి వాగుడు వాగుతుంటే పురాణం వింటున్నారు. తన్ని తగలెయ్యక.

నీల : అయ్యగారూ..! నా మావని చమించి ఒగ్గేయండి.! మేం మల్లా ఈ గుడిసాయలక్కూడా రాము. రా మావా..! (కాళ్ళమీద పడుతుంది)

కైలాస : మడి గట్టుకుంటే ముట్టుకుంటా వేంటే పాపిష్ఠిముండ. అనునిత్యం పరమశివోపాసన చేసే నాకు అర్థంకాని శివతత్వాన్ని చెబుతున్నాడటే నీ మావ.!

నీల : ఆడికేం తెలీదయ్యా..! మీరు పెద్దోల్లు.! నేను నచ్చ చెప్పుకుంటా.!

కైలాస : తీసుకుపో..! ప్రశాంతమైన గుడి వాతావరణాన్ని అశాంతి పాలు చేసిన ఈ వెధవని మరెప్పుడూ గుడి సాయలక్కూడా రానీయవాక.! అడుగో నా కాళహస్తీశ్వరుడు ఏదో చెబుతున్నాడు. ఏంటి స్వామి.! ఈ తిన్నడు నీ భక్తుడు కాడా.! నీ గుడిని అపవిత్రం చెయ్యటానికే వచ్చాడా..! ఇప్పుడేం చెయ్యమంటావు స్వామీ.! తిన్నడిని స్థంబానికి కట్టేసి నూరు కొరడా దెబ్బలు శిక్ష వేస్తే పాపం పరిహారమౌతుందా..! అలానే స్వామి..! అలానే.. నీ ఆజ్ఞను శిరసావహిస్తాను.!

నీల : అయ్యా..! శివయ్యగారితో సెప్పయ్యా.! నా మావ తట్టుకోలేదయ్యా.! ఇంకెప్పుడూ ఈ గుడి సాయలక్కూడా రామయ్యా.!

కైలాస : చూస్తుంటే పాపం అమాయకరాలుగా ఉన్నావు.! పరమేశ్వరా.! ఈ ఒక్కసారికి ఈ భక్తురాలి కోరికను మన్నించి శిక్షను రద్దు చేయవా.! హరహర నా మీద కోప్పడతున్నావేం తండ్రీ.!

నీల : సామీ..! శివయ్యసామీ..! మా లాంటోల్లు గుడికి రాటమే పాపం.! నిన్ను చూడాలను కోటం ఇంకా పాపం.! నీకు కోటి దండాలెట్టుకుంటా..! నా మావను శిచ్చించమాక సామీ.!

కైలాస : అసలు శిక్ష రద్దు చేయటం కుదరదా.! అమ్మా..! నీ భర్త శిక్షను స్వామి తగ్గించాడు.! కేవలం యాభై కొరడా దెబ్బలతో పాప పరిహారం చేస్తాడట.! ఎంత దయగల తండ్రో చూశావా.!

తిన్న : రేయ్.! కాలహస్తీశ్వరుడు నీతో మాట్లాడుతున్నాడా.! ఏమయ్యా.! మీలో ఏ ఒక్కరికన్నా ఆయన మాట వినపడిందా.!

రెడ్డి : అసొంటి మహాత్ములకి తప్ప కాలత్తీశ్వరుని మాటలు ఎవరికీ ఇనపడవు. ఆయన బిడ్డకు కూడా..!

తిన్న : అంతా మోసం.! ఈ పెద్ద పూజారి మీ అందర్నీ మోసం చేస్తున్నాడు.!

రెడ్డి : అపవయ్యా.! అప్పుడెల్లావ్‌గా..! మల్లా ఎందుకొచ్చావ్.!

తిన్న : నువ్వు వెళ్ళమన్నావని వెళ్ళలా..! మీలాంటోళ్ళ చేతుల్లో శివయ్య చిక్కుకున్నాడే అని బాధతో చూడలేక వెళ్ళిపోయా.!

రెడ్డి : మరి .? మల్లా ఎందుకొచ్చినట్లు.!

తిన్న : నా శివయ్యను నాతోపాటు ఉడుమూరుకి తీసుకు పోదామని..రా.. శివయ్యా..రా..! నాతోపాటు నా పల్లెకు పోదాం..! భక్తులమని చెప్పి జనాన్ని నమ్మించే ఈ దొంగల మధ్య మనకేమిపని?

రెడ్డి : ఏం కూశావురా..! (మీదికి వచ్చి తిన్ననిపై చెయ్యెత్తును. ఆ చెయ్యి అలాగే పట్టుకొని గట్టిగా నొక్కుతూ..)

తిన్న : రేయ్.! ఇంకొక్కమాట తూలావో.. ఏం సేత్తానో నాకే తెలీదు. నాకూ శివయ్యకూ మధ్య మీరెవరంటా..! మీపని మీరు చూసుకోండి.! నాపని నేను చూసుకుంటా..!

కైలాస : వీడిలా మాటలతో చెప్తే ఎందుకువింటాడండీ.. ఆ శిక్షేదో పడితే అప్పుడు దార్లోకొస్తాడు. పట్టండిరా..! నాలుగు తగిలించి బయటకు ఈడ్చెయ్యండి.!

తిన్న : తంతారే..! రండి..! సిన్నపట్నుండి సింగాలతో ఆడుకున్న సేతులు. వట్టిచేత్తో మదపు టేనుగును కూల్చేసిన సేతులు. వచ్చారో.. సచ్చారే..! రండిరా.. మొనగాళ్ళయితే.!

కైలాస : వాళ్ళదాకా ఎందుకు రా..! నేనే వస్తా..! ఏం చేస్తావోయ్.! (ముందుకు వచ్చిన కైలాసనాథ శాస్త్రిని, రెడ్డిని ఇద్దరినీ చెరో చేత్తో పట్టుకొంటాడు. వాళ్ళు విలవిలలాడుతుంటారు. తిన్నడు ఈ క్రింది విధంగా ప్రార్థిస్తాడు)

తిన్న : మ : నను మన్నించెదవేని నీవిపుడు రా నా వెంట, రాకుండినన్
నిను నే బాసి చనంగ నోప, నిచట న్నీతోడిదే లోకమై
మనువాడం, గనువాడ నీకరుణ, నీ మౌనంబు చిత్తంబు వ
చ్చినచో మానుదు గాని, నిన్నిపుడు కస్తింబెట్ట నా కేటికిన్ **18**

సరే..! శివయ్యా..! నువ్వు వచ్చేవరకూ నేనిక్కడి నుండి కదలను. నిన్నే తలుస్తూ ఈడ్నే కూసుంటా. (కాశీనాథ శాస్త్రి తిన్నడికి నమస్కరిస్తాడు. కైలాసనాథ శాస్త్రి కాశీతో..)

కైలాస : రేయ్..! కాశీ.! వచ్చి వీడి బారినుండి నన్ను రక్షించకుండా వాడికి దణ్ణంపెడతావేరా దౌర్భాగ్యుడా..!

కాశీ : నాన్నగారూ..! నాకు ఈ తిన్నడిలో ముగ్ధభక్తి మాత్రమే కనిపిస్తుంది. అచెంచలమైన భక్తితో ఆ పరమేశ్వరుని ప్రార్థించే ప్రార్థనలో మీకు అతని అమాయకత్వం కనిపించటంలేదా..! పరమేశ్వరుడు మనవాడని మనం అనుకుంటాం కానీ నిజానికి ఇటువంటి ముగ్ధభక్తులకే వశమౌతాడు.

(తిన్నడికి నమస్కరిస్తాడు కాశీనాథశాస్త్రి. తిన్నడు కైలాసనాథ శాస్త్రిని, రెడ్డిగారిని వదిలేస్తాడు)

కైలాస : మొరటు వెధవ..! భల్లూకపు పట్టు పట్టాడు కదండీ రెడ్డిగారూ..!

రెడ్డి : మరే..! వీడిసంగతిలా కాదు. రాజుగారితో చెప్పి వీడి తాట ఒలిపించకపోతే నేనీ కాళహస్తి పట్టణ అధికారినే కాను.

తిన్న : రేయ్.!

కైలాస : ఇక్కడే నిలబడితే కరిచినా కరుస్తాడు.! అడవి మనిషి.. అడవి మనిషి.!

(రెడ్డిగారూ, కైలాసనాథ శాస్త్రి ఇద్దరూ అక్కడి నుండి జారుకుంటారు)

కాశీ : తిన్నయ్యా..! శాంతించు.! నీవంటివారికి ఆవేశం పనికిరాదు. పరమేశ్వరుడు కరుణా స్వరూపుడు. అతనిని చూడవలెననిన కేవలం భక్తికి తప్ప మరే ఇతరములకు కట్టుబడడు. ఆ భక్తికి కామ,క్రోధ,మోహ, మద, మాత్సర్యాలు అడ్డుగోడలు. కనుక వాటిని విడిచి పెట్టి సాత్వికమైన స్వభావంతో పరమేశ్వరుని ధ్యానించు. తప్పక ఆతడు నీకు దర్శనమీయగలడు.

తిన్న : చిన్న శాత్రులుగారూ.! మీరింత ఇదిగా చెప్తున్నారు. ఆయనేంటండీ.!

కాశీ : తిన్నయ్యా.! ఇక్కడే పరమాత్ముడి యొక్క చిన్న లీలను మనం గమనించవచ్చు. నీవు కిరాతుల ఇంట పుట్టినప్పటికీ చదువుకున్నావు. మంచి ఏలికగా మీ గూడెపు వాసులనుండి మన్ననలు అందుకున్నావు. ఇక్కడ ఎన్నో ఏళ్ళు విద్యాభ్యాసం ద్వారా సాధించలేని రాజనీతి, తర్క, మీమాంసాదులు వంటపట్టించుకున్నావ్.! ఆవేశాన్ని విడనాడు..!

(కాశీ వివరిస్తుంటాడు.. లైట్స్ ఫేడ్ అవుతూ...)

**(లైట్స్ ఆఫ్)**

## 5.వ రంగము

(మనోరంజితం శివలింగానికి నమస్కరించి వేడుకొనుచుండును.)

మనో : తనువే నిత్యముగా నొనర్చు మదిలేదా చచ్చి జన్మింపకుం
డ నుపాయంబు ఘటింపు మాగతుల రెండ న్నేర్పు లేకున్న లే
దని నాకిప్పుడ చెప్పు చేయగల కార్యంబున్న సంసేవ జే
సి నినుం గాంచెదగాక కాలమునసో శ్రీకాళహస్తీశ్వరా..! 19

స్వామీ..! నిన్ను చేరే మార్గమును నాకుపదేశించు గురువులు ఎవరు స్వామీ.! నీవే నన్ను నీదరికి చేర్చుకొనరాదా.! ఇంకా ఎన్నాళ్ళు ఈ శరీర లంపటములు. వీటినుండి నాకు విముక్తి కలిగించి నీలో ఐక్యం చేసుకోలేవా..! శ్రీ కాళహస్తీశ్వరా..!

(తలుపు చప్పుడగును)

ఇంకా పది దినములుండెను కదా.! ఈ కైలాసనాథ శాస్త్రి మరలా వచ్చాడా.! ఎవరది?

కాశీ : నేను కాశీనాథ శాస్త్రిని. కైలాసనాథ శాస్త్రి కుమారుడను.

మనో : తండ్రికి తగిన కొడుకులా వున్నాడే.! ఇప్పుడేమిటి దారి.! ఏదైన అది అగును.! కాళహస్తీశ్వరా నీదే భారము.! (తలుపు తీయును) చిన్న శాస్త్రుల వారికి ఇన్నాళ్ళకు దయకలిగిందేం. నేనీ పురమునకు వచ్చి మూడు దినములైనది. తమరు మా గృహమును పావనము చేయుటకు ఇన్నాళ్ళు పట్టినది.!

కాశీ : రావాలని ఎప్పటికప్పుడు అనుకుంటునే వున్నాను. మీకు తెలియనిది కాదుగా..!

మనో : నిజమేలేండి.! గుడికి వచ్చే భక్తులను కటాక్షించే ఆ కాళహస్తీశ్వరుడన్నా ఒకింత సేద తీరుతాడేమో కానీ, తమరు మాత్రం...

కాశీ : నిష్కారణ దూషణలెందుకు?

మనో : ఇదిగో ఈ ఆసనాన్ని అలంకరించండి.! (అంటూ పక్కనే వచ్చి కూర్చొనబోవును. కాశీనాథ శాస్త్రి ఆమెను వారిస్తూ...)

కాశీ : బోధకుడు కూర్చొన వలసిన స్థానమునకు అభిముఖమే మీ స్థానము. అక్కడ..

మనో : బోధకుడా..! బోధనా..! శృంగార పాఠములు బోధింతురా..! లేక...

కాశీ : శృంగార శాస్త్రం. అత్యంత పవిత్రమైన శాస్త్రం. సృష్టి యజ్ఞము నిర్వహించుటకు అత్యంత ఆవశ్యకమైన శాస్త్రం. ఆ శాస్త్రమును సైతం వివరింతును.

మనో : అయితే..! బోధించండి వింటాను.! (వచ్చి కాశీనాథ శాస్త్రి మెడచుట్టూ చేతులు వేసి వెనుక నుంచి వాటేసుకోబోవును. కాశీనాథశాస్త్రి ఆ చేతులు తప్పిస్తూ..)

కాశీ : తల్లీ..!

మనో : తల్లా..!

కాశీ : అవునమ్మా.! ప్రతి పురుషునకు తన భార్య తప్ప తక్కిన స్త్రీలందరూ తల్లులతో సమానమని వేదములు, ఉపనిషత్తులు వివరించుట లేదా.! ఎట్టి శాస్త్ర విజ్ఞానమునైనా నేర్వగోరు వారు దానిని అనుగ్రహించు వారలను భక్తితో, గురువుగా భావించి సేవించవలెనే కానీ ఇటుల అనుచిత ప్రవర్తనములు చేయవలదు.

మనో : నన్ను క్షమించండి. మీరును మీ తండ్రి గారి వలెనే నా శరీరమును, నా అందమును కోరి వచ్చితిరని భ్రమకు లోనైతిని.

కాశీ : తల్లీ..! ఈ శ్రీకాళహస్తి క్షేత్ర మహాత్మ్యమును ఎవ్వరేని తెలుసుకొన గోర స్వయముగా వారి కడకేగి వివరింతునని నియమము పెట్టుకుంటిని. మీకు ఈ క్షేత్ర మహాత్మ్యమును తెలుసుకొన వలెనని ఉత్సుకతతో ఉంటిరని తెలిసుకొని మీ వద్దకు వచ్చితిని.

మనో : మహాత్మా..! నాకు గల సందేహములను నాపై దయవుంచి నివృత్తి చేయండి.! ప్రకృతి పురుషుల మధ్య సంబంధం.

కాశీ : అవినాభావం.

మనో : శివలింగంలోని ఆంతర్యం?

కాశీ : ప్రకృతి, పురుషుల కలయిక. సృష్టి యజ్ఞానికి ప్రతీక.

మనో : ప్రకృతి, పురుషులు పొందవలసినదేమిటి?

కాశీ : తృప్తి.

మనో : మనిషి దేనికి బానిస?

కాశీ : మాయ.

మనో : అదెలా?

కాశీ : మలభూయిష్ట మనోజధామము సుషుమ్నా ద్వారమో యారు కుం
డలియో పాదకరాక్షియుగ్మంబులు షట్కంజంబులో మోము దా
జలజంబో నిటలంబు చంద్రకళయో సంగంబు యోగంబొ గా
సిలి సేవింతురు కాంతలన్ భువి జనుల్ శ్రీకాళహస్తీశ్వరా.! -20

భగవంతునికన్నా అత్యంత శక్తివంతమైనది అతనిద్వారా జనింపబడిన మాయ. అట్టి మాయ జయించవలెననిన నిగ్రహము అవసరము. కామవికారములు మాయకు తొలి లక్షణములు. వాటిని విడనాడవలెననిన కాళహస్తీశ్వరుని చరణ కమలముల శరణు జొచ్చవలె.

మనో : మహాత్మా..! మీ వంటివారి సాంగత్యము నొందవలెనను నా కోరిక ఇన్నినాళ్ళకు ఫలించినది. మీరు అంగీకరించిన మిమ్ములను నా ఆధ్యాత్మిక గురువుగా పొందుదను.

కాశీ : ఆధ్యాత్మికముగ నీ జ్ఞానకాంక్ష అనుపమానము. పురుషులందు పుణ్యపురుషులు వేరుగా వుందురు. అట్టి పుణ్యపురుషుని కనుగొని వానిని గురువుగా భావించుట ఉత్తమము.

మనో : అట్టి వారెవరైననూ కలరా...!

కాశీ : అందరికీ సద్గురుడు.. ఆ కాళహస్తీశ్వరుడు కాక మరెవరు.?

మనో : ఆతనిని చేరు మార్గమును ఉపదేశించి నన్ను కటాక్షించండి.!

కాశీ : తప్పక నాకు తెలిసిన మార్గములను వివరింతును. శ్రవణం, కీర్తనం, స్మరణం, పాదసేవ, అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, ఆత్మనివేదనం. వీటిని నవవిధ భక్తి మార్గములు అంటారు. వీటిలో ఏ మార్గముద్వారా నైనను మనం కాళహస్తీశ్వరుని చేరవచ్చు.

మనో : పుణ్యపురుషా..! మీరు చూపిన మార్గములో నేను పయనింతును. నన్ను ఆ కాళహస్తీశునిలో ఐక్యమొందించునంతవరకూ వెన్నంటి నడిపించండి. మీకు సదా ఋణపడి వుందును.

కాశీ : కాళహస్తీశ్వరార్పణమస్తు.

మనో : మరొక చిన్న విషయము.. ఇటువంటి పరిస్థితి ఏ పుత్రునకు ఎదురు కాకూడదు.

కాశీ : మా తండ్రిగారి గురించే చెప్పదలచుకుంటే మీరు శ్రమపడనవసరం లేదు. తగిన తరుణము వచ్చువరకూ వేచి చూడక తప్పదు.

మనో : మరొక పది దినములే నాకు వ్యవధి వున్నది.

కాశీ : కాళహస్తీశునిపై ధ్యానముంచండి. అందరికీ దారిచూపే ఆ పరమాత్ముడు తప్పక మనకూ ఒక దారి చూపకమానడు. శుభం భుయాత్.! (వెడలిపోవును)

**(లైట్స్ ఆఫ్)**

**6.**వ రంగము

(తిన్నడు మాంసము, తేనె, పూలు, పళ్ళు, నోటిలో నీళ్ళు తీసుకొని దేవాలయమునకు వచ్చును. శివునకు సమర్పించును. శివునికి నమస్కరించును. అక్కడున్న శివనిర్మాల్యాన్ని కాలితో తొలగించును. నోటిలో వున్న నీటితో శివుని అభిషేకించును. తాను తెచ్చిన పూలు అక్కడ పెట్టును. చంకలో వున్న అడవి పంది మాంసమును శివునికి నివేదించును.)

తిన్న : స్వామీ..! నేడు వేటకెళ్ళిన నాకు నీ కృపతో తొలుత ఈ అడవి పంది దొరికినది. దానిని చంపి ఆ మాంసపు ముక్కలు కాల్చి, వ్రేల్చి దొప్పలలో పెట్టి తీసుకొచ్చాను. మొగిలేటి నీళ్ళు నీకు అభిషేక జలంగా తీసుకొచ్చాను. స్వామీ.! దుర్మార్గులు, కుత్సిత స్వభావులైన వారు చేయుచున్న పూజలు నీవు స్వీకరించవని చదువుకున్నాను. పూజలే స్వీకరించని వాడవు ప్రసాదాలెలా స్వీకరిస్తావు చెప్పు. ఎన్నాళ్ళ నుంచో ఉపవాసం చేస్తూ ఇక్కడున్నావో కదా.! దోరదోరగా కాల్చిన ఈ మాంసం తిన్నావనుకో అట్టే కరిగి పోతుంది. ఈ పుట్టతేనె, ఈ పాలు అన్నీ నీకోసమే..! తొందరగా కానీ..! నేనా బయటుంటాను.! ఎవరైనా వస్తే నువ్వు తినలేవుగా..! నేనొక్కణ్ణే వున్నా ఇక్కడ.! (బయటకి వెళ్ళి వచ్చును.)

ఏంటయ్యా.! తినవూ..!

క : కాలవొ, క్రొవ్వవొ, మాడం
గాలెనొ, చవిగావొ, కమ్మగావో, నీకున్
జాలవొ, యలవడవో, తిన్న
వేలా కఱకుట్లు? పార్వతీశ్వర! చెపుమా.! **21**

( నోట పెట్టుకొని తినును, పాలు కొద్దిగా తాగును, తేనె తాగును) అన్నీ బానే వున్నాయి కదా స్వామీ.! ఇంకేటి ఆలస్యం. ఆకలిగా లేదా? లేక నేనేమైనా అపచారం చేశానా.! శివా.! శంకరా..!

క : ఆకలి గాదో, భక్తి
దేకువ గలవాడగానొ, తినవేల? కృపన్
సాకగదే! నన్నిపు డ
ఱ్ఱాకల బెట్టక పలాశనాసక్తుడవై **22**

కాశీ : ఏంటి తిన్నయ్యా.! నీలో నీవే అలా బాధపడుతున్నావ్.!

తిన్న : చిన్న శాస్త్రులుగారూ.! పరమేశ్వరుడు పేద, గొప్ప, కులం, వర్ణం వంటివి చూడడని, భక్తితో ఎవరు ఏం నివేదించినా తీసుకుంటాడని చెప్పారు కదా.!

కాశీ : అవును?

తిన్న : మరి నేనేం లోపం చేశానో తెలియటం లేదు.! కాళహస్తీశ్వరుడు నేను తెచ్చిన పదార్థాలను ముట్టటం లేదు. చిన్న స్వామీ నువ్వయినా చెప్పి నేను తెచ్చిన పదార్థాలను తినమని చెప్పు. నీ మంత్రాల భాషలో చెప్పావంటే వింటాడేమో.!

కాశీ : తిన్నయ్యా.! స్వామి మంత్రాల భాషలోనే చెప్తేనే వినడయ్యా.!

తిన్న : మరి ఎలా చెప్తే వింటాడో అలాగే చెప్పండి స్వామీ.!

కాశీ : ఆయన భాష మౌనం. ఆమౌనం లోంచి వెలువడేదే భక్తి. ఆ భక్తితో నివేదించిన ఏ నివేదనైనా ఆరగించగలడు.

తిన్న : నేను ఆ కాళహస్తీశ్వరునిపై అచెంచలమైన భక్తి విశ్వాశాలతోనే మాంసము, పూలు, పండ్లు, పాలు, తేనె తెచ్చి అర్పించాను. వాటిని నా స్వామి ముట్టటంలేదు.

కాశీ : ఏమిటీ? వాటిని స్వామెలా స్వీకరించును. (కాశీనాధశాస్త్రిలోనికి వెళ్ళాడు. తిన్నడు చెప్పినవికాక అక్కడ పంచభక్ష్యాలు కనిపించును) అరె.! పంచభక్ష్య పరమాన్నములను తెచ్చి మాంసమని నాతో వేళాకోళమాడు చున్నాడేమిటి? తిన్నయ్యా.! నీవు నాతో వేళాకోళమాడటం లేదు కదా.!

తిన్న : నేనేళాకోలమాడేదేంది స్వామీ.!

కాశీ : నీవు నివేదించానని చెప్పుచున్నవి వేరు. అక్కడ నాకు కనపడినవి వేరు.

తిన్న : లేదు స్వామీ.! నేను తెచ్చింది అడవి పంది మాంసమే.!

కాశీ : హే కాళహస్తీశ్వరా.! నీ మాహాత్మ్యమును ఏమని వివరింతును.! ఈభక్తుని అనుగ్రహించితివా తండ్రీ.! ముగ్ధభక్తుల మనోహర చరిత్రలో తిన్నయ్య చరిత్రను చరితార్ధం చెయ్యదలచావా.! నీలీల నెంచతరమా..! నీల కంధరా..!

తిన్న : క : నెపమొకటి గలదె నాపై?
నుపవాసముతోడ బడలి యుండగ నీకే
యపరాధము సేయ గలదె?
కృపతో గఱకుట్టు లారగింపం గదవే? **23**

నీ వారగింప కుండిన జీవన వేమిటికి నాకు? శివ! నీపదరాజీవములమీద ప్రాణములే విడుతును. శంకరా..! పురహరా..! (అని తన తలను తీసుకొని శివలింగమునకు వేసి బాదుకొనును. శివలింగము వెనుక దివ్యమైన కాంతి పుంజము వచ్చును.)

శివుడు : తిన్నయ్యా.! నీ పదార్థములు స్వీకరించెదను. నీవే తినిపించు.!

తిన్న : స్వామీ..! ఎంత చక్కటి రూపమయ్యా నీది.! (కాశీనాథ శాస్త్రికి కనబడదు. తిన్నడిని తన్మయత్వంతో చూస్తుంటాడు) ఎంత చల్లని స్వామివయ్యా.! ఇదిగోయ్యా కరకుట్లు తిను.! (తిన్నడు పెడుతుండగా చేతిలోనివి చేతిలోనే మాయమగును.) నన్ను ఇలా అనుగ్రహించితివా స్వామీ.!

శివుడు : తినయ్యా.! సకల జీవరాశికి తిండిపెట్టి ఆదరించే నాకు ఈరోజు తిండిపెడుతున్నావంటే...

తిన్న : స్వామీ..! అంతా మాకే ఇచ్చేసి నువ్వు బిక్షపాత్రపట్టుకోవట్లేదా..! అందులో మా పాపాలు వేయమంటున్నావ్. మరి తిండెవరు పెడతారయ్యా నీకు.

శివుడు : నాకు తిండిపెట్టటమంటే మాటలు కాదు. ప్రతి దినమూ ఇలాగే పెడతావా.!

తిన్న : నీ అనుగ్రహం వుంటే..! తప్పకుండా స్వామీ..!

శివుడు : వెళ్ళిరా..! (తిన్నడు నమస్కరించి వెళ్ళిపోవును)

కాశీ : (తనలో) ఒరే కాశీ...! ఈ తిన్నడు...!

క : అందియ్య, శివుడు తగ నా
నందించుచు నారగించినన్, ముదమున మి
న్నంది పుళిందేంద్రుడు, కా
నం దిరుగుచు నిట్లు దిన దినంబును గొలువన్ **24**

హే..! భక్తవ శంకరా..! గిరిజా మనోరమణా..! జ్ఞానప్రశూనాంబికా సమేత శ్రీకాళ హస్తీశ్వరా.! హే శంకరా.! పంచాక్షరీ మంత్రమును నా ఉచ్ఛ్వాశ నిశ్వాశలుగా చేసుకొని, శివమాహత్మ్యాన్ని

తెలియజేయటమే నా కర్తవ్యముగా భావించి, శివసేవ చేయు నన్ను కాదని ఆ తిన్నని అనుగ్రహించెదవా తండ్రి.! ఇదెక్కడి న్యాయం.

శ్రీకంఠ! కంఠ భూషిత
కాకోదరవర ! వరాకఖండమత వ్యా
ఖ్యాకోలాహల దూర! చి
దాకృతి! జితకాల ! కాళహస్తీశ! శివా! 25

నేను పుట్టి బుద్దెరిగిన నాటి నుండి నీవే అని నమ్మానే.! అందుకు అంతపెద్ద బహుమానం నాకు కాక ఆ తిన్ననికి అనుగ్రహించుట ఎంతవరకు న్యాయం.

నాపాలి మూలధనంబవు, నాపాలి
భాగ్యదేవతవు, నాపాలి నిధివి,
నాపాలి దేవరత్నమవు, నాపాలి క
ల్పక పాదపమవు, నాపాలి మతివి,
నాపాలి యిహ సాధనంబవు, నాపాలి
వర సాధకుడవు, నాపాలి గతివి,
నాపాలి శుభ కారణంబవు, నాపాలి
పరమ పుణ్యమవు, నాపాలి విరివి,
దేవ! నాపాలి దేవతా ధేనుమణివి,
శూలి! నాపాలి తంగేటి జున్ను వీవ,
నన్ను విడనాడ గత మెద్ది? నత నిలింప!
యేమి యపరాధ మొనరించి? తీశ! యనగ..! 26

నీవు అనుగ్రహించని ఈ నా జీవితం వృధా..! ఇన్నినాళ్ళు నేను చేసిన సేవలు, పూజలు సకలం వృధా..! నీ కృపాకటాక్ష వీక్షణలకు నోచుకోని ఈ జీవితాన్ని నీకే నైవేద్యంగా అర్పిస్తున్నాను. మరుజన్మకైనా నీ అనుగ్రహం కలిగేలా అనుగ్రహించు. ఓం నమఃశివాయ.! ఓం నమఃశివాయ...! ఓం నమఃశివాయ...!

శివుడు : కాశీనాథ శాస్త్రి...! ఏమిటీ విపరీతం.! నీ జ్ఞానసంపద ఏమైంది.! ఒక మూర్ఖునిలా ఎందుకు ప్రవర్తిస్తున్నావ్.! అరిషడ్వర్గాల మాయలోపడి పరమార్థాన్ని గ్రహించలేక పోతున్నావ్.!

కాశీ : (కాశీనాథశాస్త్రి చుట్టూ చూస్తాడు. అతనికి ఎవ్వరూ కనపడరు. పరమశివుడు చిద్విలాసం చిందిస్తూ వుంటాడు. కానీ కాశీనాథ శాస్త్రికి కనిపించడు) ఎవరు? ఎవరు నాతో మాట్లాడేది?

శివుడు : నేనే.

కాశీ : నేనే అంటే..! పేరు..! పేరు చెప్పండి.!

శివుడు : నీలో ఉన్న నేనుని నేనే.! నీలోనే కాను ప్రతి జీవరాశిలో వున్న నేనుని నేనే. నాకు అనేక పేర్లున్నాయ్.! ఎవరికి తోచినట్లు వారు పిలుస్తారు.!

కాశీ : నాలోవున్న నేనువా.! మరి నీలో వున్న నేను నేనవ్వాలిగా..!

శివుడు : అవును.! నీలో వున్న నేనుని నేనైనప్పుడు, నాలోని నేను నీవు కావా.! కాశీనాథ శాస్త్రి నా రూపం చిన్మయం, నారూపం అనంతం, నా రూపం జ్యోతిస్వరూపం, నా రూపం

లింగాకారం, ఆకాశమే నా ఆకారం, భూమియే నా విభూతి, అగ్నియే నా త్రినేత్రం, వాయువు నా చలనం, జలం జగమేలే నా దరహాసం పంచభూతాత్మకమై, ప్రపంచేశ్వరునై నీలోనే కొలువున్నాను.

కాశీ : నాలో వున్నావా.! స్వామీ.! నాలో వున్న మిమ్మల్ని నేను చూడాలను కుంటున్నాను.! దయచేసి అనుగ్రహించండి స్వామీ.!

శివుడు : కాశీనాథ శాస్త్రి..! నీవు భక్తి వున్మాదంలో నీ విచక్షణా జ్ఞానాన్ని పూర్తిగా వినియోగించలేక పోతున్నావు. నీవు అరిషడ్వర్గాల మాయనుండి వెలికిరా. నిజానికి నేను నీ ముందున్నా కూడా గుర్తించలేని స్థితిలో నిన్ను ఆ మాయ కమ్మేసింది. నీలో వున్న నన్ను గుర్తించలేక పోతున్నావు. రా..! వాటిని తొలగించుకు రా..! నా రూపాన్ని వీక్షించు.!

కాశీ : హే..! కాళహస్తీశ్వరా..! పురవరా..! భవహరా..! శంకరా..! పాహి..పాహి.. పాహి..! అర్థమైంది తండ్రీ..! నాలో ఇన్నాళ్ళూ వున్నది భక్తి ఒక్కటే అనుకున్నాను. కాదు ఈర్ష్య, అసూయ, నేనే అధికుడననే గర్వం, ఏదో చెయ్యాలనే ఆవేశం నాలోనే ఉన్నాయని గుర్తించలేకపోయాను. నా కళ్ళు తెరిపించావు తండ్రీ.! అన్యథా శరణం నాస్తి... త్వ మేవ శరణం మమ అంటూ నీ పాదములు శరణంటిని.!

శివుడు : నాన్నా..! కాశీ..! నీవు చేయవలసిన కార్యము పూర్తిచేసిన వెంటనే నిన్ను నాలో ఐక్యం చేసుకుని ముక్తిని ప్రసాదించెదను. వక్రమార్గమున పయనిస్తున్న నీ తండ్రిని సరైన మార్గములో పెట్టు. (కైలాస నాథశాస్త్రి వచ్చును) ముక్తి మార్గమును కోరు మనోరంజితానికి ఆ మార్గమును ఉపదేశించు.

కాశీ : తమరి ఆజ్ఞను తప్పక శిరసావహించెదను స్వామీ.!

కైలాస : రేయ్..! కాశీ..! ఏం చేస్తున్నావ్.! గుడిని శుభ్రపరచి అభిషేకానికి అన్ని ఏర్పాట్లు చెయ్యమని చెప్పానా లేదా.!

కాశీ : చేస్తున్నాను నాన్నగారూ..!

కైలాస : (లోపలికి వెళ్తాడు) ఏం చెయ్యటమో ఏమో.! ఈ మధ్య నీవాలకం ఏమీ బాగాలేదు. నీలో నువ్వే మాట్లాడుకుంటున్నావ్.!

కాశీ : కాళహస్తీశ్వరునితో మాట్లాడుతున్నాను నాన్నగారూ.!

కైలాస : ఒరేయ్ కాశీ.! కాళహస్తీశ్వరుడు కాదు, కాకరకాయ కాదు. ఒక్కసారి ఆలోచించి చూడు ఈ రాయిలో దేవుడుంటాడ్రా.!

కాశీ : అదేంటి నాన్నా.! దేవుడే లేడా.!

కైలాస : మనం అలా చెప్పకపోతే జనం గుడికి రారు. అలా చెప్పటం మనవిధి. భక్తితో కానుకలు సమర్పించటం వాళ్ళ వెట్టి.

కాశీ : ఇన్ని తెలిసి భక్తులను మోసం చేయటం పాపం కద నాన్నా.!

కైలాస : పుణ్యమనేది ఉంటేనే కదరా.! పాపం అంటటానికి.! అయినా మనం చేస్తున్నదంతా చూస్తుంటుందట్రా ఈ బండరాయి.! దేవాలయాల్ని వ్యాపార కేంద్రాలుగా మార్చుకొని భక్తి వ్యాపారం చేయటమే ప్రభుత్వ ఉద్దేశం. జీర్ణదేవాలయ ఉద్ధరణ పేరుతో ప్రజలనుండి కానుకలు వసూలు చేయకపోతే మనలాంటివాళ్ళకు జీతాలెక్కడ నుండి వస్తాయి. జీవితాలెలా నడుస్తాయి.! అందుకే దేవాదాయ ధర్మాదాయ శాఖను ఏర్పాటు చేశారు మన రాజుగారు. అదిసరే తిప్పయ్యశెట్టికి మనోరంజితం ఇంటి వద్ద కనిపించావట.. ఏంటి విషయం.

కాశీ : మనోరంజితం పేరుకు తగ్గట్లే మనస్సుని రంజింపచేస్తుంది నాన్నగారూ..! మీతో ఇన్నాళ్ళూ ఎలా చెప్పాలా అని సందేహించాను. మీరే విషయాన్ని నావద్దకు తీసుకొచ్చారుకనుక..

కైలాస : కనుక... ప్రేమిస్తున్నానంటావా..? పెళ్ళికూడా చేయమంటావా.? ఒరేయ్.. ఒరేయ్.. అప్రాచ్యుడా... తన కులమేంటి.? మనకులమేంటి?

కాశీ : మనోరంజితం చాలా మంచిది నాన్నగారూ..!

కైలాస : మంచిది.! ఒరేయ్..! నా అనుభవమంతలేదు నీవయసు.! నీకు మనోరంజితం కావాలి.! నీకు దాని సంగతి తెలీక దాని వెంట పడుతున్నావ్..! అలాంటి వారిని ఎంతమందిని నేను చూడలేదు..! దాన్ని మర్చిపో..!

కాశీ : అదేంటి నాన్నగారూ..! ఒకసారి మనసిచ్చింతర్వాత..!

కైలాస : ఇచ్చింది మనసేకదా..! అయితే ఏం ఫర్వాలేదు.! నువ్వెళ్ళి సువర్ణముఖిలో నీళ్ళు తీసుకురా..! స్వామివారికి అభిషేకం చేయాలి.!

కాశీ : అలాగే నాన్నా..! (కాశి బిందె తీసుకొని బయటికి వెళ్తాడు)

కైలాస : ఈ కాశిగాడికేమొచ్చింది మాయరోగం.! నా మనోమీద కన్నేశాడు.! ఆ.. అదిమాత్రం తక్కువ తిందా..! ఎంతమందిని నమిలేసి.. వాళ్ళ ఆస్తుల్నికాజేసి తనాస్తుల్ని పెంచుకుంది. పెంచుకున్న ఆస్తుల్ని పదిలంగా కాపాడుకుంటుంది.! ఏమైనా మనోరంజితం మనః రంజితమే..! హరహర మహదేవ..! శంభోశంకరా..! నీ కళ్ళున్నాయి ఏం చేసుకోను.. మనో చూడు.. తన కన్నులతో శాసిస్తుంది.! మునిపంటి బిగవుతో జివ్వున మత్తెక్కిస్తుంది..! వల్లకాట్లో వాసముంటూ.. చితాభస్మాన్ని పూసుకొని, పాముల్ని మెళ్ళో వేసుకు తిరిగే నీకేం తెలుస్తుందిలేవయ్యా..! శృంగారరసం.! ఆస్వాదించాలన్నా.. అనుభవించాలన్నా.. అర్హతుండాలి.! ఈ పిల్లసన్యాసి పెళ్ళీడుకొచ్చాడు కదూ..! ముందస్తుపాఠాలకోసం సానింటి గడప తొక్కుంటాడు.! అయినా ముందు మనోమీద కన్నేసింది నేను... కాబట్టి మనో నాదే అవుతుంది. కనుక కాశిగాడికి పిన్నివరస అవుతుంది. అంతగా పాఠాలు నేర్పించాల్సి వస్తే కన్నెరికం చేయని మంచి కన్నెని చూడమని మనోతో చెబితే అదే చూసిపెడుతుంది. (అంటూ ఆలయంలోకి వెళతాడు.. అక్కడ ఎముకలు.. మాంసపు ముక్కలుండటం చూసి) ఛీ..ఛీ..ఛీ.. ఈ ఎముకలు, మాంసపుముక్కలు.. ఏ ఎలుగుబంటో, పెద్దపులో తెచ్చి ఇక్కడ పడేయలేదు కదా..! కోయతిన్నడే గుడిచుట్టే చస్తున్నాడు.! వాడూ.. మా కాశీగాడు కుమ్మక్కై ఏమన్నా..! అబ్బో ముక్కుపుటాలు పగిలిపోతున్నాయ్..! వెధవ పీనుగకి ఏ పుట్టతేనో, తంగేటి జున్నో దొరికి చావలే, ఈ అప్రాచ్యాన్ని తెచ్చి తగలేశాడు. ఇప్పుడెలా తీయటం.! (అటూ ఇటూ చూస్తాడు.) ఎవ్వరూ లేరుకదా..! (ముక్కు మూసుకొని ఆ ఎముకలు, మాంసం తీసి బయటకు వస్తుండగా... రెడ్డిగారు ఎదురవుతాడు)

రెడ్డి : ఏంది పంతులుగారూ..! ఈ సెండాలం..!

కైలా : ఈ కోయవెధవని ఇరికిస్తే సరిపోతుంది.! ఛండాలమని చిన్నగా అంటారేంటి రెడ్డిగారూ.! పరమఛండాలమైతేనూ.. గర్భగుడిలోకి మాంసం ముక్కలొచ్చిపడ్డాయ్..! నేను తప్ప ఆ గర్భగుడిలోకి వెళ్ళగలిగేవారు లేరాయె..!

రెడ్డి : పెద్దపులో.. ఎలుగ్గొడ్డో తెచ్చుంటదిలే పంతులూ..!

కైలా : నేనూ అలాగే అనుకున్నానండీ రెడ్డిగారూ.! పెద్దపులో, ఎలుగ్గొడ్డో అయితే మాంసాన్ని కాల్చి తినదుగా..! ఇది ఆత్రాష్టుడి పనే.. అదే ..! ఆ కోయవెధవలేడండీ..!

రెడ్డి : ఏ కోయవెధవండీ..! ఆ..! ఆ..! వాడా..! మిమ్మల్ని తన్నాడూ..!

కైలా : ఆ అప్రాచ్యుడే.. మీకూ నలుగు పెట్టాడుగా..!

రెడ్డి : అయితే ఏందయ్యా నువ్విప్పుడనేది.!

కైలా : ఆవేశపడవాకండి రెడ్డిగారూ..! ఆ అప్రాచ్యుడు ఈ ఆలయంలోకి ప్రవేశించి..! ఏంటి..! మీరొద్దని శాసనం చేసినాకూడా..! ఆలయంలోకొచ్చి ఈ ముదనష్టాన్ని స్వామివారికి నివేదన అంటూ పెట్టాడండీ..! అంతే స్వామివారు మీరొచ్చే ముందే..! ఒక పదిహేను లిప్తలకాలంలో నాకీవిషయం చెప్పి వెళ్ళిపోయాడు.

రెడ్డి : అబ్బా..! సామెలుతుంటే ఉండమనక్కర్లా..!

కైలా : బ్రతిమిలాడానండీ బాబో..! వింటేనా..! ఇక నేనూరుకుంటానా..! కాళహస్తి గ్రామాధికారి వీరారెడ్డిగారు వచ్చి స్వామి ఏడని అడిగితే నేనేం సమాధానం చెప్పాలి.! పరమశివా..! భక్తవ శంకరా..! కాళహస్తీశ్వరా అంటూ కాళ్ళావేళ్ళాపడ్డా.!

రెడ్డి : అదీ.. అట్టడగాల..! సామి..కరుణించాడా..!

కైలా : కరుణించాడండీ..! కటాక్షించాడు కూడా..!

రెడ్డి : బతికించావ్ పంతులూ..! సామికి నామీద అంత నమ్మకముందేందయ్యా..!

కైలా : మరే..! కానీ..! తప్పదండీ..!

రెడ్డి : ఏందయ్యా అదీ..! ఏం కానీ,ఏం తప్పదు..!

కైలా : కాస్త ఈ దరిద్రాన్ని అవతల పడేసిరాకూడదు..!

రెడ్డి : అదెంతపనిలేకానీ.. సెప్పవయ్యా పంతులూ.. ఏందా కానీ..,

కైలా : నా గుడి ఆ కోయవాడి రాకతో మైలపడిపోయింది., కనుక మహాకుంభాభిషేకంతో ఈ ఆలయాన్ని శుద్ధిచేయిస్తేతప్ప గుళ్ళోకి రానన్నాడండీ స్వామి.!

రెడ్డి : అబ్బా..! పెద్ద సిక్కే వచ్చి పడ్డదే పంతులూ..! మొన్నీమద్దేగా చేపించింది. మల్లానా..! ఇప్పుడాడుండాడు సామి.?

కైలా : అదిగో ఆ మారేడు చెట్టుకింద పడుకున్నాడండీ.! రండి మాట్టాడొద్దాం..! (మారేడు చెట్టుకిందకి వెళ్ళినట్లు నటించును. ఇంతలో కాశీనాథశాస్త్రి బిందెతో వస్తాడు. జరిగే చోద్యాన్ని కాశీ వింతగా చూస్తుంటాడు.)

ఉ: ప్రాతలు మీద గప్పిన గృపామతి నోర్చితి, నీచుపొత్తునన్
బ్రాతిమెయిన్ మెసంగితివి, భక్తుండు కుంటెన బంపబోతి, మై
పూత యొనర్చుకొంటి శవభూతి, గపాలమునన్ భుజింతి, తీ
రోతలు పెక్కులుండ నివి రోయుదువే? యిక భక్తవత్సలా.! **27**

స్వామి..! కాళహస్తీశ్వరా..! ఇదిగోండి మీ భక్తుడు వీరారెడ్డిగారు.! మీతో విన్నవించుకోటానికి వచ్చారు.!

రెడ్డి : (కైలాసనాథశాస్త్రి చూపినవైపే చూస్తూ దణ్ణంపెట్టుకొని చెబుతుంటాడు..) అయ్యా.! స్వామీ.! మీరేం అలిగే పన్లే..! నేను..! నేను మీరుసెప్పిన ఆ మహాకుంభాభిషేకం చేపిత్తా..! ఈడెందుక్కానీ.. అందాక ఆ గుల్లోనే ఉండయ్యా..! మా అయ్యవుకదూ..! ఎల్లయ్యా ఎల్లు.! పాదనమస్కారం చేసుకుంటా.. వెళ్ళండి సామీ.! పంతులోరూ..! ఇంటికిరండి..! కావాల్సిన దుడ్డు ఇచ్చి పంపుతాను.!

**(లైట్స్ ఆఫ్)**

## 7.వ రంగము

(స్పాట్‌లైట్ ఆన్ అయి వుంటుంది. స్పాట్‌లైట్‌లో మనోరంజితం కాశీనాథశాస్త్రికోసం ఎదురు చూస్తుంటుంది. కాశీనాథశాస్త్రి అక్కడికి వస్తాడు.)

కాశీ : వచ్చి చాలా సేపైందా.!

మనో : ఇంత ఉదయానే రమ్మన్నారు.

కాశీ : అత్యవసర కార్యమై రమ్మన్నాను. అదీ మీ వల్లనే సాధ్యమౌతుందని నమ్మి మీ సాయం కోరదామని..!

మనో : సంకోచించకండి.!

కాశీ : తల్లీ.! మా తండ్రిగారికి తగిన బుద్ధి చెప్పే తరుణం ఆసన్నమైంది. తమరు ఇందుకు సహకరిస్తే...!

మనో : అవస్యం.! అంతకన్నా మహద్భాగ్యం ఏమున్నది.! అయితే నేను చేయవలసినది.!

కాశీ : విన్నవించుకుంటాను.! అంతకన్నా ముందు మనం అతనికి బుద్ధి చెప్పటానికి కారణాల్ని కూడా తమకు విన్నవించుకోవాలి.! మా తండ్రి అమాయకులైన పురజనులను నమ్మించి దైవాంశ సంభూతినిగా చలామణి అవుతున్నాడు. అంతటితో ఆగకుండా మహాభక్తుడైన తిన్నయ్యపై ద్వేషం పెంచుకుని అతనికి హాని చెయ్యాలని చూస్తున్నాడు.

మనో : తిన్నయ్యా..! అతనెవరు మహాత్మా.?

కాశీ : శ్రీకాళహస్తీశ్వరుని మెప్పించిన మహాభక్తుడు.! అతను అర్పించిన నైవేద్యాన్ని పరమేశ్వరుడు ప్రీతితో ఆరగించటం నేను చూశాను. అంతటి మహాభక్తునిపై ద్వేషాన్ని పెంచుకున్న నాతండ్రి ఎంతటి నీచానికైనా దిగజారతాడనటంలో సందేహం లేదు.!

మనో : పరమేశ్వరుడు స్వయంగా ప్రసాదాన్ని ఆరగించటం ఎక్కడైనా జరిగిందా స్వామీ.!

కాశీ : నమ్మితీరాలమ్మా.! నిత్యం ఓం నమః శివాయ అనే పంచాక్షరినే ఊపిరిగా బ్రతుకుతున్న నాకు కూడా దక్కని మహద్భాగ్యాన్ని దక్కించుకున్న ఆ కోయ తిన్నడు తన ముగ్ధభక్తితో మహాదేవుని తన వానిగా చేసుకున్నాడమ్మా.! ధూపదీపనైవేద్యాలతో అర్చించే నాకు దక్కని ఆ అదృష్టం అతనికి దక్కటం నేను ఈ కనులతో చూశాను. నాకు దక్కని ఆ మహద్భాగ్యానికి వగచి నా తలను శివలింగమునకు మోదుకొనుచుండగా శివవాణి నాకు వినిపించింది. శివవాణిగా నాకు వినిపించిన కాళహస్తీశుని సంకల్పం నిజమే అయితే ఆ మహద్భాగ్యాన్ని నువ్వే కనులారా వీక్షింతువు రా తల్లీ..! నాతో వస్తే నిజం మీకే తెలుస్తుంది.

మనో : పదండి మహాత్మా.! ఆ భాగ్యాన్ని కనులారా వీక్షించి అయినా తరింతును.!

(మరో వైపు శివలింగంమీద స్పాట్ ఆన్ అవుతుంది. తిన్నడు దోసిలిలో పూలు, నోటిలో నీళ్ళు, సంకలో మాసం దొప్పలు పెట్టుకొని ధనుర్భాణాలతో వస్తాడు.)

కాశీ : తిన్నయ్య మహాదేవునికి నైవేద్యం పెట్టటానికి వచ్చే సమయం ఆసన్నమైంది. అందుకే గుడి తలుపులు ఓరగా వేసి వచ్చాను.! రండమ్మా..!

(తిన్నయ్య శివలింగం వద్దఉన్న నిర్మాల్యాన్ని కాళ్ళతో తోసేస్తాడు. నోటిలోవున్న నీళ్ళతో శివుని అభిషేకిస్తాడు. దోసిలిలో వున్న పూలను శివలింగంమీద పోస్తాడు. ఇదంతా మనోరంజితం, కాశీనాథశాస్త్రి ఇద్దరూ చూస్తారు. తాను శివునికి నివేదించేందుకు తెచ్చిన మాంసాన్ని శివునిముందు పెడతాడు.)

తిన్న : ప్రణామ్య శిరసా దేవం స్వయంభుం పరమేశ్వరం
ఏకం సర్వగతం దేవం సర్వదేవమయం విభుమ్
రుద్రవర్మ ప్రవక్ష్యామి అంగప్రాణస్య రక్షయే
అహోరాత్రమయం దేవం రక్షార్థం నిర్మితం పురా
రుద్రో మే చాగ్రతః పాతు పాతు పార్శ్వౌ హరస్తథా
శిరో మే ఈశ్వరః పాతు లలాటం నీలలోహితః
నేత్రయోస్త్ర్యంబకః పాతు ముఖం పాతు మహేశ్వరః
కర్ణయోః పాతు మే శంభుర్నాసికాయాం సదాశివః ॥ **28**

(తిన్నడు పెట్టేవన్నీ గాలిలోనే మాయమైపోతుంటాయి. మనోరంజితం తన కళ్ళను తను నమ్మలేకపోతుంది.)

తిన్న : సామీ..! నీకోసమే తీసుకొచ్చా.! లేత కరకుట్లు..! దోరగా కాల్చి తెచ్చా.! పుట్టతేనె పట్టుకొచ్చా.! దా సామీ.! మంచి ఆకలిమీదుండుంటావ్.! సామీ.! ఆ పట్టు.! అదీ..! తినుసామీ.!

(తిన్నయ్య వెళ్ళిపోతాడు. మనోరంజితం కాశీనాథశాస్త్రి ఇద్దరూ కూడా చీకట్లో దాక్కుంటారు. తిన్నయ్య వెళ్ళగానే మనోరంజితం కాశీ వంక ప్రశ్నార్థకంగాచూస్తుంది.)

కాశీ : తల్లీ చూశారుగా..! ఆదిదేవుని అనుగ్రహాన్ని పొందిన మహాభక్తుడు ఇతడు.

మనో : వందే శంభు ముమాపతిం సురగురుం వందే జగత్కారణం
వందే పన్నగభూషణం మృగధరం వందే పశూనాం పతిమ్
వందే సూర్యశశాంకవహ్నినయనం వందే ముకుందప్రియం
వందే భక్తజనాశ్రయం చ వరదం వందే శివం శంకరమ్ **29**

కర్తవ్యాన్ని ఉపదేశించండి మహాత్మా..!

(కాశీనాథశాస్త్రి మనోరంజితం చెవిలో ఏం చేయాలో చెబుతాడు. మనోరంజితం తలూపుతూ అతనికి నమస్కరిస్తుంది. స్పాట్‌లైట్ ఆఫ్.. అన్ని లైట్లు వెలుగుతాయి..దేవాలయం కనిపిస్తుంది. కైలాసనాథ శాస్త్రి బిందెతో నీళ్ళుపట్టుకొస్తాడు. గుడిబయటే వున్న కాశీని, మనోరంజితాన్ని చూస్తాడు.)

కైలాస : గుడిబైటే అఘోరించావే..! నిర్మాల్యాన్ని తొలగించి శుభ్రపరచమని చెప్పి చచ్చానుగా..!

కాశీ : లోనికెలా వెళ్ళమంటారు నాన్నా.! స్వామివారి వద్ద మాంసం ముక్కలుంటేనూ..!

కైలాస : ఊ..! ఆ కోయవెధవ మళ్ళీ గుళ్ళోకి తగలబడ్డట్టున్నాడు.! గుడ్లగూబలా గుడ్లు మిటకరించి అలా చూస్తావు.! వెళ్ళి రెడ్డిగారిని పిలుచుకురా..! ఈ రోజుతో ఆ కోయవెధవ సంగతి అటో ఇటో తేలుస్తా..! (కాశీ వెళ్ళిపోతాడు) మనో..! మనో..! ఇన్నాళ్ళకి దయకలిగిందే ఈ దాసునిపై..!

మనో : నా వ్రతం పరిసమాప్తమైందని చెబుదామని వస్తే.. మీకాశీ.!

కైలాస : నిన్నేమైనా చేశాడా..! చెప్పు..! వాడి చర్మం వలిచేస్తా..!

మనో : మీరంతటి ఘటికులని నాకు తెలీదూ..! బ్రహ్మజ్ఞానంలో బ్రాహ్మణోత్తములు, కత్తిపట్టారా.. క్షాత్రవరేణ్యులు.! మీ కదన కౌశలానికి ఎదురేలేదని పురజనులు అనుకుంటుంటే విన్నాను.!

కైలాస : మరి దేవిగారెప్పుడు కరుణిస్తారు.! (దగ్గరకు రాబోతాడు)

మనో : ఇది దేవాలయం కదా.!

కైలాస : నీ ముగ్ధమనోహర రూపాన్ని చూస్తుంటే దేవాలయమైనా, దేవేంద్ర వైభవంతో తులతూగే నీ ఇంటిని తలపిస్తోంది.!

మనో : సరసానికి సమయం లేదా..!

కైలాస : ముగ్ధమనోహరమైన మనోరంజిత మగువను ఎదురుగా వుంచుకొని సమయం చూసుకునేవాడు సరసుడు కాడు. ఎప్పుడెప్పుడు ఆ అందం నా పొందు చేరుతుందా అని పదిహేను దినాలు, క్షణమొక యుగంగా పరితపించానో తెలుసా..!

మనో : ఏనాడు మీరు నా మెడలో ఈ కాళహస్తీశుని సన్నిధిలో నిర్మాల్యాన్ని వేశారో.. ఆనాడే దానిని నేను వరమాలగా భావించాను శాస్త్రులుగారూ..!

కైలాస : నిజమా..!

మనో : మీ అంతటివారితో అబద్ధం చెప్పగలనా.! కాకపోతే నాదో చిన్న ముచ్చట తీర్చాలి.!

కైలాస : కోరుకో మనో..! కోరుకో..! ఆ నింగిన తెచ్చి నీ పాదల చెంత వుంచమందువా.! ఆ చంద్రుని నీ సిగలో దురిమి అలంకరించమందువా.! ఇంద్రధనసుని నీ నడుముకి వడ్డాణం చేయమందువా.!

మనో : హర .. హర..!

కైలాస : మన మధ్యలో ఆయనెందుకు?

మనో : ఊరిజనులొస్తే మనిద్దరిపనీ అంతే.! రాత్రికి నా ఇంటికి రండి.! ఉత్తచేతులతో కాదు.!

కైలాస : మీ సానులకుండే లక్షణమేఇది.! నగలేందే..!

మనో : నా ఇంటి గడప తొక్కనివ్వను.! రాజుగారు స్వామివారికేదో హారం చేయించారటగా..!

కైలాస : అవునూ..! చాలా ఖరీదైనది.!

మనో : అయితే..! అంత ఖరీదైన ఆభరణం నా గళసీమను అలంకరించుకుంటే,

కైలాస : పరమేశ్వరునికంటే అది నీ గళసీమనుండుటయే శోభనిస్తుంది. సదా పాములను ధరించే ఆ స్మశానవాసికి ఇంతటి విలువైన హారమా..! అది నీ స్థనద్వయంపై నీ ఉచ్ఛ్వాశ నిఛ్వాసలలో ఓలలాడుతుంటే, ఆ అందం, పొందే ఆనందం.. మనో..! అనుభవైకమే దప్ప వర్ణనకు వీలుకానిది.!

మనో : శాస్త్రులుగారు.! కళ్ళముందే కైలాసాన్ని చూపుతున్నారు.! నగతో వస్తేనే నా పొందు.! లేకపోతే ఇంతే సంగతులు.!

కైలాస : (కైలాసనాథశాస్త్రిలోనికి వెళ్ళి హారాన్ని తీసుకొచ్చి మనోరంజితం మెడలో అలంకరిస్తాడు.) మనోరంజితం.! నీవు నిజంగా మనఃరంజితానివేనే..! అంగాంగ ఆలింగన సల్లాప సరస శృంగారకేళిలో నా శృంగార దేవతను ఆహా.. ఓహో మంత్రాలతో అర్చిస్తూ, మల్లె, జాజి, సంపెంగ వంటి పుష్పాలతో పూజిస్తూ, కస్తూరి, జవ్వాది, జాజి, జాపత్రి, పునుగు, శ్రీగంధం వంటి సుగంధ ద్రవ్యాల గుభాళింపులలో మన్మధరసరాజ్యాన్ని ఆవిష్కరిద్దాం.! ముగ్ధమనోహర మనోరంజిత కుసుమంపై సుధలను గ్రోల వచ్చిన తుమ్మెదనై ఝుంకరిస్తూ, నిన్ను తనివితీరా పొందుతాను మనో..! హరహర మహాదేవ.! ఇదుగో మనో..! ఈ హారాన్ని ఇంట్లో ఉన్న సమయంలోనే ధరించు, ఇది ధరించి బయటకు రాకుసుమా..!

మనో : కోరగానే కనికరించారు.! ఇక మీరాకకు అడ్డేలేదు.! మరీవిషయం ఊరివాళ్ళకు తెలిస్తే..!

కైలాస : అవన్నీ చూసుకోటానికి నేనున్నానుగా..! ఓపని చెయ్.! ఈ హారం నీకు దక్కాలంటే నేను చెప్పినట్లు చెయ్యాలి.!

మనో : చెప్పండి.!

కైలాస : నువ్వా గర్భగుడిలో శివలింగం చాటు దాక్కో.! మహాదేవా.! పరమేశ్వరా..! ఈనగను తీసిందెవరని వీరందరికీ వివరించమని అడుగుతాను..! అప్పుడు నువ్వు ఉడుమూరి తిన్నయ్య అని చెప్పు.! చాలు మిగిలిన కథ నేను నడిపిస్తాను.! హారానికి హారం వస్తుంది..! తిన్నడి పీడ విరగడైపోతుంది.! వెళ్ళు.. వెళ్ళలా దాక్కో.!

మనో : మరి కాశీ వస్తే..!

కైలాస : ఆ వెధవని నేను గుళ్ళోకి రానిస్తానా.! నువ్వేం భయపడకు.! వెళ్ళు..!

(మనోరంజితం గుళ్ళోకి వెళుతుంది. కైలాసనాథ శాస్త్రి కాసేపు అటూ ఇటూ తిరిగి దూరంగా కాశీ రెడ్డిగారిని తీసుకురావటం చూస్తాడు. గుడి లోపలికి వెళ్ళి మాంసపు ముక్కలు తీసుకొని గుడిలోంచి బయటకు వస్తాడు.)

ఏవిటండీ మాకీ ఖర్మ.! మీరు సరైన శిక్ష వేయకుంటే ఆ కోయవాడి ఆగడాలకు అడ్డుకట్ట వేయలేం.!

రెడ్డి : భటులారా.! వేగంగా వెళ్లి ఆ కోయ తిన్నయ్యను వెంటబెట్టుకురాండి.! గుల్లో మాంసం ముక్కలు పెడతాడా..!

కైలాస : అంతేకాదండీ.! రాజుగారు శ్రీవారికి సమర్పించిన అత్యంత విలువైన హారాన్ని కూడా అపహరించాడు.

రెడ్డి : దొంగతనాలు కూడా మొదలెట్టాడండీ..! ఇక వీణ్ణి పరమేశ్వరుడు క్షమించడు.! ఆ హారం దొంగతనం చేసినోడికి పుట్టగతులుండవు.! అయినా నిరాధారంగా నిందమోపటం సరైంది కాదు.!

కైలాస : అంటే.! నేను అబద్ధం చెబుతున్నాననా.!

రెడ్డి : కాదండీ.! హారం అతనే దొంగతనం చేశాడంటానికి సాచ్చం లేదుగా అని.!

కైలాస : సాక్షిగా నాపరమశివుడే ఉన్నాడు.! అదిగో ఆ పరమశివుడు విన్నవించుచున్నాడు.. హే..! పరమశివా..! కాళహస్తీశ్వరా.! నీవు చెప్పు నీ నగను కాజేసిన వారెవరు? అదిగో కోయ తిన్నడే అని నా స్వామి అంత స్పష్టంగా వివరిస్తున్నారు రెడ్డిగారూ.!

(రాజభటులు తిన్నని పెడరెక్కలు విరచికట్టి తీసుకొస్తారు. వెంట నీలకూడా వస్తుంది)

నీల : ఏం పాపం సేసినాడని నామావను ఇట్టా కట్టపెడుతున్నారు.?

కైలాస : నోరుమూయవే..! పాపిష్టిముండ.! చేసిందంతా చేసి ఏమీ తెలీనట్లు నన్నడుగుతున్నావా..!

నీల : నిజంగా నామావకేపాపం తెలవదయ్యా.!

రెడ్డి : అది విచారించాల్సింది నేను.! న్యాయస్థానం అడుగుతుంది.! నీపేరు?

తిన్న : శివుడు.

రెడ్డి : నీ తండ్రిపేరు?

తిన్న : శివుడు.

రెడ్డి : తల్లిపేరు?

తిన్న : శివుడు.

కైలాస : ఏం వేళాకోళమా.! ఇంకా చూస్తారేం రెడ్డిగారూ.! నాలుగు తగిలించి నిజాన్ని రాబట్టండి.! (తిన్నణ్ణి కొరడాతో కొడతారు.)

నీల : అయ్యా.! కొట్టకండయ్యా.! చచ్చిపోతాడయ్యా.! కొట్టమాకండయ్యా.!

రెడ్డి : దీన్ని ఈడ్చిపారెయ్యండి.!

నీల : మావా..! ఏమైందిమావా..! ఆల్లు చెప్పినట్లు ఈ గుడిసాయలకి రానని సెప్పుమావా.! మనబోటోల్లు గుల్లోకెల్లకూడదుమావా.!

తిన్న : నీల..! ఎందుకు బాధపడుతున్నావ్.! కొట్టేది దేహాన్నేకానీ నన్ను కాదు.! నేను ఎవరను కుంటున్నావ్? శివుడిని.! ఈ జగమంతా శివమయమే.! శివుడే కొడుతున్నాడు.! శివుడే ఆ బాధను తీసుకుంటున్నాడు. మధ్యలో కేవలం నేను ఒక పాత్రను మాత్రమే.!

కైలాస : విన్నారటండీ వీడు వీడి పైత్యం.! చేసిందంతా చేసి ధర్మపన్నాలు చెబుతున్నాడు.! ఆ నగ ఎక్కడరా.!

నీల : ఏం నగయ్యా.!

కైలాస : తెలీనట్లడుగుతావే.! రాజుగారు శ్రీవారికి కానుకగా సమర్పించిన నగ.! ఈ ప్రపంచంలోనే అత్యంత ఖరీదైన నగ.! దాన్ని నీ మావ దొంగతనంచేశాడే.! నిజం చెప్పు నీకే ఇచ్చి వుంటాడు.! చెప్పు ఎక్కడదాచావ్.!

నీల : అయ్యా.! చేయని నేరానికి దొంగంటున్నారు.! నామావ దొంగకాదు.! దొంగబ్రతుకులు మావికావు.!

కైలాస : అంటే మావనా.!

నీల : దొంగతనం చేసినోడికి తెలియాలి.! ఆ కాత్రేనికి తెలియాలి.!

కైలాస : ఆ కాత్రేడే చెబుతున్నాడే.! నీ మావే దొంగతనం చేశాడని.!

నీల : నామావ సెప్పింది నిజంసామీ.! ఆ కాత్రేని నాలుగు గదులమధ్య బందించారు. మీరు పెట్టే పెసాదాలు తిని ఆ సామి మీకే సాచ్చికం ఇత్తున్నాడు.!

తిన్న : నీలా..! తప్పు.! కాత్రేని నిందించకూడదే.! స్వామి గుళ్ళోలేడే..! గుండెల్లో ఉండాడే.! నీలో..! నాలో..! ఈ ప్రపంచమంతా వున్నాడు.!

కైలాస : నగ సంగతి తేల్చండి.!

రెడ్డి : తిన్నా..! నగేంచేశావ్.!

తిన్న : నాస్వామి మెడలో నాగుల్ని చూశానుకానీ, నగల్ని చూడలేదు.! ఎంత చక్కని రూపమయ్యా.!

రెడ్డి : ఇంకా చూస్తారే.! తన్నండి.! (రాజభటులు కొరడాతో కొడతారు)

కాశీ : ఆగండి.! ఆ నగ తిన్నయ్యతీసి వుండడు.!

రెడ్డి : తిన్నయ్యే దొంగని ఆ స్వామే చెబుతున్నాడుగా.!

కాశీ : స్వామి సాక్ష్యమీయగా ఇక్కడ ఎవరైనా విన్నారా.!

కైలాస : నేను విన్నాను.! స్వయంగా స్వామే నాకు చెప్పారు.!

నీల : అబద్ధమయ్యా.! అంతా అబద్ధం.!

కైలాస : నోర్ముయ్.!

కాశీ : నిజం బైటపడితే ఎవరు నోరు ఎలా మూతపడుతుందో తెలుస్తుంది.!

రెడ్డి : చిన్నస్వామీ..! నాయినగారితో అట్టేనా మాట్టాడేది?

కాశీ : మీరు కాసింత ఓపిక పడితే నిజం తేలుస్తాను.! అవకాశమివ్వండి రెడ్డిగారూ.!

కైలాస : కాశీ.! చిన్నవాడివి నీకేంతెలీదు.!

కాశీ : ఇన్నాళ్ళూ..! మీ అకృత్యాలన్నీ తెలిసినా కూడా నేనేం మాట్లాడలేకపోయాను.! ఇంకా మాట్లాడకపోతే చరిత్ర నన్ను క్షమించదు.!

రెడ్డి : ఏంది చిన్నస్వామీ నాయినగారిని ఎగర్తించి మాట్టాడుతున్నావ్.!

కైలాస : లేదు రెడ్డిగారూ.! నామాట నమ్మటంలేదని అర్థమైంది.! ఇది నా భక్తికి పరీక్ష.! హే పరమేశ్వరా.! పరంజ్యోతి స్వరూపా..!

క: ఓ శరణాగతవత్సల!
కాశవనప్రభన ! దీనకల్పక ! యాప
న్నాశకర! దురితగిరి దే
వేశ! ననుం గరుణ జూడవే సుఖి నగుదున్ 30

చెప్పు కాళహస్తీశ్వరా..! నీ భక్తుడు కైలాసనాథ శాస్త్రి అడుగుతున్నాడు. నేరం చేసింది ఎవరు? నాకు కాదు..! ఈ రోజు ఈ శ్రీకాళహస్తిపుర గ్రామ ప్రజలందరూకూడా నీ సాక్ష్యం కోసం ఎదురు చూస్తున్నారు.! వీరందరికీ వినిపించేలా నీ వాణిని ప్రతిధ్వనించు..! నీవాణి వినిపించు.! నీ నగను తీసింది ఎవరు?

మనో : కోయ తిన్నడు..! (కైలాసనాథశాస్త్రి ఆనందిస్తూ విన్నారుగా అన్నట్లు అభినయిస్తాడు) కాదు.! నగను కాజేసింది కైలాసనాథశాస్త్రి.!

కైలాస : అన్యాయం.!

రెడ్డి : అన్యాయమంటావేందండీ.! స్వామి అంత సక్కగా సెలవిత్తే..!

కైలాస : హర..హర..! ఏమిటీ భక్తునికి పరీక్ష.!

మనో : (మనోరంజితం శివలింగం చాటునుండి నగను తీసుకొస్తుంది) క్షమించండి కాళహస్తిపుర అధికారులారా.! ప్రజలారా.! కైలాసనాథశాస్త్రి నిజస్వరూపాన్ని తెలియజేసేందుకే ఇలా చేయాల్సి వచ్చింది.! మీరంతా పోయిందనుకుంటున్న నగ ఇదిగో ఇదే.!

కైలాస : ఇంత మోసమా..! నిన్నూ..!

రెడ్డి : ఆగవయ్యా.! పంతులుగారూ.! నువ్వు చెప్పమ్మా.!

మనో : దేవునిపేరుచెప్పి ప్రజల్ని మోసం చేస్తున్న ఈ కైలాసనాథశాస్త్రి నన్నూ కోరుకున్నాడు.! తనకు సహకరించకపోతే కాళహస్తిపురమునుండి వెడలగొట్టించెదనని, మరణ శిక్షకూడా విధించెదనని బెదరించాడు. ఆయన కుమారుడు కాశీనాథశాస్త్రులు సహకారముతో ఈయనగారి లీలలను ఈ విధంగా ప్రజలముందు బయటపెట్టాను.! తిన్నడు మహాభక్తుడు.!

రెడ్డి : అట్టైతే.! నేనడిగిన ప్రశ్నలకు అబద్ధం ఎందుకు చెప్పాడు.!

కైలాస : అలా అడగండి.!

రెడ్డి : నువ్వు నోర్ముయ్.! పెద్దశాత్రుల్ని బంధించండ్రా.!

కైలాస : హే..! పరమేశ్వరా..! నీ భక్తుడికింత అవమానం జరుగుతుంటే చూస్తూ సహిస్తావా.! ఎక్కడ నీ ప్రమథగణాలు.! ఎక్కడ నీ శాఖినీ, ఢాకినీ, మోహినీ పిశాచ రాక్షసగణాలు, వీరభద్ర, భద్రకాళీ.. రండి.. ఈ పాపాత్ముల్ని..

రెడ్డి : ఏడ్రా నీ ఈరభద్రుడు... ఏడ్రా నీ ప్రమథగణాలు..! చేసినమోసం చాలు.!

కాశీ : అయ్యా..! రెడ్డిగారూ.! ఈ మహాభక్తుడు మీరడిగిన ప్రతి ప్రశ్నకూ శివుడనే సమాధాన మిచ్చాడు. ఆ సమాధానం అక్షరసత్యాలు. ఆత్మ పరంజ్యోతి స్వరూపం. శివలింగాకారం.! కనుక తాను శివుడినన్నాడు. నేను అంటే ఆత్మస్వరూపం..! కనుకనే అతను నేను శివుణ్ణి అన్నాడు. తన తల్లి, తండ్రీ, ఈ ప్రపంచమే అతనికి శివమయమైనప్పుడు అతని సమాధానంలోకూడా శివం ఉండటంలో తప్పులేదుగా..! సంవత్సరాల తరబడీ తపస్సు చేస్తేకానీ లభించని ఈ ఆత్మ విజ్ఞానం ఇతని ఇంతత్వరగా సాక్షాత్కరించటం ఇతని పూర్వజన్మ సుకృతమే నండీ.!

రెడ్డి : (తిన్నడి బంధనాలు తెంచేస్తాడు) నన్ను చమించండి తిన్నయ్యగారో..! ఈ పెద్దపంతులోరు శిచ్చార్హుడు.! రాజధానికి తరలించండి.!

(మనోరంజితం, కాశీనాథశాస్త్రి, నీల అందరూ తిన్నయ్య చుట్టూ చేరతారు. తిన్నయ్య నమస్కరిస్తూ కాళహస్తీశుని వైపు నడుస్తాడు. కాశీనాథశాస్త్రిని రాజభటులు పెడరెక్కలు విరిచి రాజధానికి తరలిస్తారు. తిన్నయ్య శివలింగం వద్దకు వెళతాడు.)

తిన్న : ఏంది సామీ నీ కళ్ళవెంట కన్నీరా..! ఎందుకు నన్ను కొట్టారనా..! ఆ దెబ్బలేవీ నాకు తగల్లేదుగా.! ఏడవమాకు సామీ.! అయ్య.! ఇది నన్ను కొట్టిన బాధతో కాదు..! నా శివయ్యకంటికేదో జబ్బు చేసింది.! చిన్నసామీ..! నాస్వామికేదో అయింది.! అయ్యో..! ఇప్పుడేంది చేయటం.! ఆ..! చిన్న సామీ.! నేనీడనే వుంటా ..! నువ్వెల్లి తంగేడాకు తెచ్చి, రేచకి నిమ్మవంచి నీరున నూటి పట్టుపట్టి తీసుకురా..! అయ్యో ఇప్పుడేమి చేయాలి.! (అంటూ తన కొంగును చించి ఆవిరి ఊది శివలింగానికి అద్దుకొనుచుండును.) నీలా నువ్వెల్లి తెల్లదింటెన పువ్వు దెచ్చి దాని రసం కలివెపువ్వులు గోసి నలచి పిండి , పేరిననెయ్యిపెట్టి, పెరుగువత్తులు వేసి, చనుబాలతో రాసి, సంకు చమిరి అయ్యో..! ఏం చేయాలి..! నువ్వెల్లి నేను చెప్పినవి తీసుకురాపో..! (కాశీతెచ్చిన, నీల తెచ్చినవి శివునకు సమర్పిస్తుంటాడు. కానీ కన్నీరు ఆగకపోగా నెత్తురుకారును.) అయ్యో ..! నా స్వామి కనుల వెంట నెత్తురు కారుచున్నది. నీరు కారేకన్నుకు లేనిపోని వైద్యం చేసి నెత్తురు తెప్పించానా.! ఇప్పుడేమి చేయటం.! ఎటూపాలుపోకున్నదే..!

క. మాటిమాటికి జేసిన మందులెల్ల
జెల్ల బో! వెల్లి గలిపిన చింతపండు,
నీట వ్రాసిన వ్రాలునై, నెఱయ వఱద
బోవు గాకేమి, నెత్తురు పుట్టనేల? **31**

ప్రాణము పోయిన పోవుగాక, శివయ్యా..! కంటికి కన్నే మందు..! నా కన్ను నీకు అమర్చెదను.!

మనో : తిన్నయ్యా.! ఏమిటా విపరీతము.!

కాశీ : అతనిని ఆపకు.! అతని భక్తికిది పరీక్ష.!

నీల : మావా..! మావా.! ఏంది మావా..! ఇది.!

తిన్న : నీలా..! పో అవతలికి.! నా స్వామికన్నా నీవెక్కువకాదు.! ఆయన బాధకన్నా మనం పొందే బాధ ఎక్కువేంకాదు..! లోకాలనాడించే ఆ తండ్రికి చూపుకావాల.! ఆ చూపు నా కంటిచూపే అవ్వటం ఏ జన్మలో చేసుకున్న అదృష్టమో కదే.! హరహర మహాదేవ..(కంటిని పెరికి శివలింగానికి అమర్చును.) స్వామీ రక్తం ఆగిందా..! కంటికి కన్నే మందు..! అరె..! ఇంకో కన్నునుంచి రక్తం కారుతుందే.! అర్థమైందిలే స్వామీ..! రెండోకన్నుకూడా నీకే ఇత్తే నాకేందని అనుకుంటున్నావా.! మూడోనేత్రంతో చూస్తా..! ప్రతి మనిషిలోనూ మూడోనేత్రం వుంటుందన్నావుగా..! ( కాలు శివలింగంపై పెట్టి తన రెండో కన్నుకూడా పెరికి శివలింగానికి అమరుస్తాడు. శివలింగం వెలుగులు చిమ్ముతుంది.)

శివ : తిన్నయ్యా.! నీ ముగ్ధభక్తికి మెచ్చాను.నీకు ఏం వరంకావాలో కోరుకో..!

తిన్న : శా: మీ పూర్ణంబగు దివ్యతేజము, జగన్మిథ్యాత్మకత్వ ప్రతి
ష్ఠా పారీణతజూపి, మమ్ము బొదువం, జాంచల్యదూరంబులై
చూపుం జిత్తము మిన్నకున్న యని, యచ్ఛోబాసె దేహంబుపై
దీపుం జీకటి, యింతకంటె వరమేది? యిట్లు మన్నింపవే.! **32**

శివ : అస్తు..! మరి మీమాటేంటి కాశీ..!

కాశీ : క: మా తలపుకన్న నధికమె
మా తలపిట్లడుగ నేల? మము మీ చిత్తం
బే తెఱగున వెలుగొందెదు,
నా తెఱగున నుండజేయు మది గాక శివా! **33**

మనో : చ: జగములు, నంతరాత్మయును, సాక్షియు నీవనుచున్ నిజంబుగా
నిగమము లాడగా వినియు, నేడితరంబుగ మా కభీప్సితం
బగు వర మెట్లు వేడగలమయ్య? భవన్మయమైన పూర్ణ చి
ద్గగనములో మముం గలిపి,క్రమ్మఱబుట్టెడు బాధ మాన్పవే.! **34**

శివ : భక్తులారా..! మీ చరితము సూర్యచంద్రులున్నంతవరకూ సుప్రసిద్ధమై వెలుగొందును. మున్ముందు కాలంలో అనేకమంది కవులు శ్రీకాళహస్తి మాహాత్మ్యమను పేర అనేక రచనలు గావించి వారి కావ్యములలో మిమ్ము సజీవులను చేయుదురు. ఈ కథను విన్నవారికి, కన్నవారికి సర్వపాపములు నసించి, సర్వశుభములూ సమకూరునట్లు వరము ఒసగు తున్నాను. ఈ తిన్నడు పూర్వజన్మమున అర్జునుడు. పాశుపతము కోరి నాతో యుద్ధము చేసిన కారణమున పశ్చాత్తప్తుడే నన్ను సేవించ నెంచుకొనిన జన్మమే ఈ తిన్నడు. మీ అందరకూ ముక్తిని ప్రసాదించుచుంటిని..! రండి..! నాలో ఐక్యం అవ్వండి.!

(కాళీహస్తీశ్వర స్థవం వస్తుండగా తిన్నడు, నీల, మనోరంజితం, కాశీనాథశాస్త్రులు శివలింగంలో ఐక్యమౌతారు.)

శుభం

# శ్రీకాళహస్తీశ్వరమాహాత్మ్యం

మూలం : ధూర్జటి కవీంద్ర విరచిత శ్రీకాళహస్తి మాహాత్మ్యం

రచన : విద్యాధర్ మునిపల్లె

దర్శకత్వం : నాయుడు గోపి

## పాత్రలు

కైలాసనాథశాస్త్రి

కాశీనాథశాస్త్రి

తిన్నడు

వీరారెడ్డి

మనోరంజితం

నీల

రాజభటుడు